సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) VETAPALEM. Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 6

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

సెప్టెంబరు 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక



ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 31 | ఏలూరు 15 సెప్టెంబరు 1942 | సంచిక 6 |
|---|---|---|

# నిత్యసంకీర్తనము

వివరణము :

శాస్త్రపరిజ్ఞాన మొక్కటియే చాలదు. అది మొదటి మెట్టు కావచ్చును. కాని గంభీరవిషయము లావలనున్నవి. మన మా విద్యామూలములనే చేరవలెను. శాస్త్రము, భగవత్సమాగమము కలిసి యోగమగుచున్నది. యోగమనుపదమే చాల పవిత్రమైనది. ఉచ్చరించిన మాత్రమున శాంతిచేకూరును. అది భగవంతునితో నైక్యమును బోధించుచున్నది. అంతరంగమున మనము ప్రవేశింపవలెను. ఆ మార్గమునే యోగము బోధించును.

సంకీర్తనము :

1. హృదయామూర్తీ! అమోఘమగు నీ యాశీర్వచనమున కెదురుచూచుచున్నాను.
2. నా జీవితము ధన్యతఁగాంచునుగాక !
3. భక్తిప్రపత్తులచే నా చిత్తము నీ పాదములయందు బంధింపఁబడునుగాక !
4. నే నెన్నండును నీకు దూరముగాకుందును గాక !

—స్వామి రామతీర్థ

# నుతి

చిలకా వేంకట కృష్ణదాసు

శా. చింతాభ్రాశుగమున్ ♦ నిజాశ్రితజన శ్రేయోనిధానాంజనం
బంతశ్శత్రుహ రామరామ్రమును ♦ బాపారణ్యదావాగ్ని వి
భ్రాంతివ్యాధి మహౌషధంబును ♦ సహం భావాంధ్య సూర్యాంశువున్
జింతారత్నము నీదునామము ♦ హరీ ! సేవింతు నశ్రాంతమున్.

---

# చేతిపనుల పాట

రచయిత:— యొరిచర్ల యెమయా

[Copy-right to the Author]

చాయ:—ఉరుదు రికార్డులోని "దర్తెనహి మునియామెముసల్మాన్ కిసికే"

1. చేతిపనులెల్ల మీరు, చేయనేర్వండీ - ప్రీతిమీర చేతిపనుల, ఖ్యాతిపొందండి ।
మీరుఖ్యాతిపొందండీ !
దేశపరిశ్రమలమీద, ఆశజూపండి - దేశభాగ్యంబుకొరకు, పాటుపడండీ
భరతదేశమెల్ల వేగ బాగుచేయుండి । మీరుబాగుపడండీ "అహచేతి"
2. నేతపనులెల్ల మీరు, నేర్చుకొనండీ - నాణ్యమైనవస్త్రములను, తీర్చినేయండి ।
మీరు తీర్చినేయండీ
మిల్లుబట్టలెల్ల మీరు, మానివేయుండీ - చల్లనైనచలువఖాది, తొడిగిచూడండీ
భరతదేశమెల్ల వేగబాగుచేయుండి - మీరు బాగుపడండీ. "అహచేతి"
3. కొయ్యపనులెల్ల మీరు, కోరినేర్వండీ - కోరినకొలుముట్లనెల్ల, నేర్చిచేయండి ।
మీరు నేర్చిచేయండీ !
సన్నగిలిన కొయ్యపనికి, వన్నెగూర్చండి - ఎన్నతరముగానికీర్తి, కూర్చుకొనండీ
భరతదేశమెల్ల వేగ బాగుచేయుండి - మీరుబాగుపడండీ. "అహచేతి"
4. మట్టిపనులెల్ల మీరు, మానబోకండీ - దిట్టమైనపనితనంబు, నేర్చికొనండి ।
మీరు నేర్చుకొనండీ.
గాజుపాత్రలెల్ల మీరు, బూజుపెట్టండి - తేజమైనమట్టికుండలు, వాడిచూడండీ
భరతదేశమెల్ల వేగ బాగుచేయుండి - మీరు బాగుపడండీ. "అహచేతి"
5. రాతిపనులెల్ల మీరు, నేర్చుకొనండీ - రమ్యమైనరాతిబొమ్మల, రాళ్లజెక్కండి ।
మీరు రాళ్లజెక్కండీ.

శిథిలమైన శిల్పవృత్తిని పదిలపర్చండి - అధికముగనుశిల్పవృత్తి ఆదరించడీ
భరతదేశమెల్ల వేగ బాగుచేయండి - మీరు బాగుపడండీ. "అహాచేతి"

6. అల్లికపనులెల్ల మీరు, ఆదరించండీ - అందమైనవస్తువులను, అల్ల నేర్వండి।
మీరు అల్లనేర్వండీ.
కూడుగుడ్డలకునుమీకు, కొదువలేదండి - కోరినసంపదలనెల్ల, కూర్చుకొనండీ
భరతదేశమెల్ల వేగ బాగుచేయండి - మీరు బాగుపడండీ. "అహాచేతి"

---

# వత్సలామోదము

(పసుపులేటి రామకోటయ్య)

ప్రపంచములో బుట్టిన ప్రతి జీవికిని అనుకరణశక్తి యనునది ప్రపంచసృష్టిలోనే దేవునిచేత ప్రసాదించబడినది. జ్ఞానరహితమైన నోరులేని జీవజంతువులు తమ పెద్ద వాటినిఁజూచి అనుకరిస్తూ యుండునని మనము గ్రహిస్తాము. ఈ యనుకరణ శక్తియే మానవులల్లోగూడ సహజమై పోయింది. మానవుడు తక్కిన జీవరాసుల కంటె జ్ఞానములో గొప్పవాడుగాన యీ అనుకరణశక్తిని కొంత చక్కబఱచుకొన వలెను. అదియేసత్సాంగత్యము. మానవుడు దీనిని తన జీవితములో ప్రధానాంశముగా నుంచుకొని తన జన్మసాఫల్యముఁ జేసుకొన వలయును. సత్సాంగత్యమనగా మంచి నడవడిగల వారితో స్నేహముచేయుటయే, అందరికిని దీనిభావము తెలుస్తుందిగాని దీనిని ఆచరించు వారరుదని గ్రహిస్తాను.

సృష్టిలోని ప్రతి చిన్న ప్రాణియుఁగూడ వాటి పెద్దవాటినిఁజూచి అవియేలాగు నడుస్తూంటాయో అవి యేలాగు పలుకుతాయో అవి యేలాగు ఆహారాన్ని తింటూవుంటాయో అదేవిధముగా అనుకరిస్తూండే అలవాటు, సృష్టిలోనే మానవులకుగూడ యీ అనుకరణశక్తి అలవాటైంది.

మనపిల్లలు చిన్నతనమునుండి ఎక్కువగా తల్లిదండ్రులను తమయింటి యిరుగుపొరుగు వారినిజూచి మంచి అలవాట్లను చెడ్డయల వాట్లనుగూడ అనుకరిస్తారు. సత్సాంగత్యముయొక్క మహిమ తెలిసికొందాము పెద్దలు నుడివినవాక్యాన్ని జ్ఞాపకముఁ జేసికొందాము.

శ్లో. సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే "నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః"

సత్పురుషులైన వారితో స్నేహము చేసినయెడల ప్రాపంచిక దుష్టవాంఛలు వాటికై యవే నశించ గలవనియు, దాని వలన నిశ్చల తత్త్వమనగా నిర్మలమైన జ్ఞానోదయమౌనని యు, దాని వలన యిహలోక సంబధములైన దార పుత్రాదులు, బంధుమిత్రాదుల మీది మోహము అనగా ప్రేమ నశిస్తుందనియు, దానివలన జీవన్ముక్తి అనగా మోక్షముతప్పక ప్రాప్తిస్తుందనియు, ఋష్యాదులు చెప్పియున్నారు.

సాధారణముగా మనపిల్లలు యేవిధముగా ప్రవర్తిస్తూంటారో తెలిసికొందాము. పిల్లలు యెక్కువగా తలిదండ్రులను అనుకరిస్తూంటారు. తల్లిదండ్రులు దురభ్యాసపరులైన వారి పిల్లలుగూడ వారి దురభ్యాసముల కలవాటు పడి దుర్మార్గు లవుతారు. తల్లిదండ్రులు సన్మార్గవర్తనులైనప్పటికిని వారు తమ బిడ్డలకు విద్యాబుద్ధులు గఱపుటయందు తగు శ్రద్ధ వహించక తమపిల్లలను చెడుమార్గములలో నడిపించి దుర్మార్గవర్తనులుగా చేసిన వారవుతారు. కొందరు తమ పిల్లలను బాహాటముగా వదలి వారి తెలివితేటలు అటులనే వృద్ధికాగలవని తలంచి వారనేక చిత్రవిచిత్రవుపనులను చేసివారలుగా తయారు చేయుదురు ఆ పిల్లలే పెద్దవారలై చెడు మార్గములఁ ద్రొక్కుచు పెద్దచిన్నయని పాటించక ధర్మముల మొదలంట ద్రొక్కి కడకు ప్రపంచములో దేవుడుఁగూడ లేడని వదరుచు స్వంతతలిదండ్రులనుగూడ పోషించక వారు బాధలను భరించుచుండ, దారపుత్రాదులు సహా కష్టాలు పడుచుండ, త్రాగుబోతులై, విషయాశక్తులై, తుదకు హత్యలకుగూడ పాల్పడి చేతిలో పైసయైనను లేక చోరత్వము నకు గూడలోనై, వారిజీవితముల నధోగతి పాలుఁగావించుకొందురు. ఈ సందర్భములో నొక చిన్న కథ జ్ఞాపకము నకు వచ్చిందిగాన దాని నిట నుదహరిస్తాన; సావధానులరై విని యెదరని నమ్ముతాను.

ఒక వూళ్లో రంగడను బాలుడు గలడు. వానికి యెనిమిది సంవత్సరముల వయస్సు. వాని తల్లి దండ్రులు వానిని చిన్నతనము నుండి బహు గారాబముతో పెంచుచుండేవారు. వారు స్థితిపరులు గాన వారి పిల్లవాడు చేసిన తుంటరిపనులను అపూరివారు సైరించి యిన్నకుండేవారు. తండ్రిఘనుడా మనిషి గాన పురజనులు రంగని తప్పులన్ని కని తండ్రికే విన్నవించుకొనేవారు. తండ్రిగాని, తల్లిగాని, పిల్లవానిని యేమాత్రము మందలించక ' మాపిల్లవాడు అటువంటివాడు కాడులే ' యని వాని చేష్టలకు సంతోషించేవాళ్లు. ఇరుగుపొరుగువారి బలవంతముమీద తల్లి దండ్రులు రంగని 8 వ యేట బడికి పంపించారు. వాడు మొదటినుండియు దుష్టసాంగత్యము నే అలవరచుకున్నవాడు గాన బడిలో గూడ దుష్టబాలురతో కలిసి తుంటరి పనులనుఁ జేయమొదలిడెను. ఒకరోజున రంగడు తన తోడిపిల్లవాని పలకను బలపమును దొంగలించి యింటికివచ్చి వాని యమ్మకు చూపించెను. వానితల్లి వాని చేష్టలకు ఆనందించి వానికి మరల పలకలు బలపములు కొని పెట్ట నవసరములేదని వానితండ్రికిఁగూడ చూపించెను. తండ్రి గూడ వానియందున్న ప్రేమాతిశయము చేతను ఖర్చుతగ్గుట చేతను మిన్నకుండెను. ఇటులనే అలవాటు ప్రకారము రంగడు ప్రతిరోజు తనబడిలోని తుంటరి పిల్లలతో గూడి పుస్తకములను, పలకలను, చివరకు పంతులుగారి జేబులోని గడియారమును గూడ సంగ్రహించి తల్లిదండ్రులకు తెచ్చి యిచ్చుచుండెను. వారు వాని చాకచక్యమునకు మెచ్చుకొనుచుండిరి.

కొన్నాళ్ళకు రంగడు పెద్దవాడై దుర్మార్గులతో స్నేహముఁ జేయుచు రాత్రులయందు యిండ్లకు కన్నములు వేయుటకు గూడ ప్రారంభించెను. వాని సంసారము

గూడ వాని చెడ్డఖర్చులచేత చిందరవందరయైకడుబీదస్థితికి లోనయ్యెను. రంగడు చోరత్వమును బహుగా సాగించుచుండెను. ఒకసారి రంగడు రక్షకభటుల చేతులలో జిక్కి బాధ లనుభవించు చుండెను. తల్లి దండ్రులకు యీ సమాచారము దెలిసి విచారపడిరి. రంగని రాజమండ్రి సెంట్రల్ జైలునకు తీసికొని వెళ్లుచున్నారని తెలిసింది. రంగడు పెద్దరైతు కుమారుడు గాన వానిని జూడ నాసపడి పౌరులు బాటకు యిరుప్రక్కల నిలుచుండిరి. తల్లిదండ్రులు గూడ కడుదుఃఖముతో రోదనము (జేయుచు వచ్చిరి. రంగని చేతులకు యినుపసంకెళ్ళను వేసి రక్షకభటులు పట్టుకొని వెళ్ళుచుండిరి. రంగడు తన తల్లితో నొక మాట చెప్పవలెనని రక్షకభటులను ప్రార్థించెను. వారు వానిని తల్లివద్దకు తెచ్చిరి. రంగడు తన తల్లిని వెళ్ళికౌగలించుకొని బిగ్గరగా నేడ్చి తన తల్లి చెవియొద్దకు వెళ్లి చెవిని గట్టిగా కొఱికెను. తల్లి తన చెవిబాధకు బహుగా నేడ్చుచు "అబ్బాయీ రంగా యిదేమిరా? నీకోపము నామీద చూపించెద వేలరా! నేనేమి చేసినానురా?" అని పలికెను. రంగడు "అమ్మా నీవు నాకు తల్లివిగాదు. నీవు నాకు చిన్నతనములో చేసిన ద్రోహము నాకు జ్ఞాపకమున్నదితే! పలక బలమును బడినుండి దొంగలించి తెచ్చినప్పుడు నీవు నాన్న సంతోషించినారు. నాన్ననుగూడ నన్ను మందలించకుండా చేసిన దానివి నీవు. కాన నీకిది శిక్ష. నాకిదే శిక్ష. అనుభవించ బోవుచున్నాను!" అని బిగ్గరగా పల్కెను. తల్లిదండ్రులు విచారపడిరి. పురజనులు ఆశ్చర్యపడిరి. రక్షకభటులు వానిని గట్టిగాబంధించి లాగుకొనివెళ్ళిరి. రంగడు రాజమండ్రి సెంట్రల్ జైలులో అన్ని నేరములకును మూడు సంవత్సరములు చెరసాల జీవితమును గడిపి తన యూరికివచ్చి బుద్ధి తెచ్చికొని కుటుంబ పోషణార్థమై యొకరైతువింట కూలిఁజేయుచు పొలములోని తన సహచరులకు తన యనుభవములను నొక కథగా వివరించుచుండేవాడు అప్పుడప్పుడు.

కాన మన మెల్లప్పుడును దుష్టులనుఁ జూచి దూరముగా వెళ్లుచు సన్మార్గులను గౌరవించుచు సత్సాంగత్యముతో మన జీవితమును గడిపిన మన జీవితము సార్థకముకాగలదని నా నమ్మిక.

---

# చరిత్రాత్మక విషయములు

(గవర్నరు జనరలుల పరిపాలనాను క్రమణిక)

**వేదుల సూర్యనారాయణశాస్త్రి**

గవర్నరు జనరలు పేరు:—వచ్చిన తేదీ - వెళ్లిన తేదీ. వారి పాలనయందు జరిగిన ముఖ్యకార్యములు.

**లార్డుకారన్వాలీసు, 1773—1785 సం॥**

**1773:**—రెగ్యులేటింగు ఆక్టును ప్రకటించుట.

**1774:**—కోర్టు ఆఫ్‌జస్టిసు అను న్యాయసభను స్థాపించుట. అయోధ్యనుండి రోహిలాలను, కర్నలు చాంపియనును పారద్రోలుట.

**1775:**—సురాజదౌలా మరణము. రాజానందకుమారుని ఉరిదీయించుట. సలసతి ద్వీపమును ఆంగ్లేయులు గైకొనుట. బనారసు జమీందారీ అయోధ్య నబాబువలన వచ్చుట.

**1776:**—మొదటి మహారాష్ట్ర యుద్ధములో జరిగిన పురుధర్ సంధి.

**1779:**—అహమ్మదాబాదు, లాహోరు. గ్వాలియరులను గైకొనుట.

**1780:**—మొదటి పాలెలూరు యుద్ధము. చిదంబర కలహము.

**1781:**—రెండవపాలెలూరి యుద్ధము, పోర్టునోవో, షోళింగరు యుద్ధము. వేలూరును విడిపించుట. డచ్చివారివగు ప్రళయకావేరి, నెగ్రాసు, నాగపూరులను గైకొనుట.

**1782:**—హైదరుని మరణము, టిప్పురాజగుట, మహారాష్ట్రులతో సాల్బివద్ద సంధి గావించుట, ఛయితుసింగును చెరయందుంచుట.

**1783:**—బెద్నూరును పట్టుకొనుట—ఫాక్సుదొరబిల్లు.

**1784:**—పిట్టుదొరబిల్లు, మంగుళూరువద్ద టిప్పుతో సంధి. బోర్డుఆఫ్‌కంట్రోలుసభ స్థాపించుట.

## సర్ జాన్ మేక్ ఫర్సన్. 1785—1686 సం.

**1785:**—ఈయన ఫిబ్రవరి 1 తేదీని ఆక్టింగుగా వచ్చి ఆ సం॥ర నవే వెడలి పోయెను.

## లార్డుకారన్వాలీసు. 1786—1796.

**1786** లో పూలో పినాంగును జయించుట.

**1789:**—టీపు తిరువాన్కూరును దండెత్తుట-దిండిగల్లు, కరూరు, కోయంబత్తూరు, ధారపురములను జయించుట.

**1790:**—జనరలు మెడోస్ శ్రీరంగపట్టణమునకు వెడలుట.

**1791:**—కారన్ వాలీసుగారు శ్రీరంగమునకు వెళ్లుట.

**1792:**—కారన్వాలీసు శ్రీరంగపట్టణమును ముట్టడించుట, బెంగుళూరు, నంది దుర్గము, ఉత్రదుర్గము సెవెన్‌డ్రూగులను పట్టుకొనుట. మలబారు, బరమహాలు, సేలం, దిండిగల్లులను టిప్పు ఆంగ్లేయుల కొసంగుట.

**1793:**—ఫ్రెంచివారికి ఇండియాయందుండే ప్రదేశములను జయించుట. నేల పన్ను వసూలు పద్ధతుల నేర్పాటు.

## సర్ జాన్‌షోరు 1793-1797:—

**1797:**—నైజాముతో విరోధము, మహమ్మదాలీ మృతినొందుట, వాని కుమారుడు ఓందత్తుల్ ఉమ్రా రాజ్యము వహించుట.

**1797:**—అసోఫద్దౌలా మరణించుట, వజీరల్లీ సింహాసనమునకు వచ్చి తొలిగింప బడినందున సాద త్తల్లీ సింహాసనమునకు వచ్చుట.

## సర్ అల్ప్యూరెడ్ క్లార్కు:—

ఈయన **6-4-1797** న ఆక్టింగుగా వచ్చి **17-5-1798** న వెళ్ళిపోయెను.

## మార్క్వేసు ఆఫ్ వెల్లస్లీ 1798-1805:—

**1798** సం॥ నందు నిజాముతో సంధిచేసుకొనుట, సిదాసూరు, మాలవల్లీలయొద్ద టిప్పును ఓడించుట.

**1799:**—టిప్పును చంపుట-శ్రీరంగపురి, కోయంబత్తూరు, కెనరా, వైనాడ్డులను గైకొనుట, వజీరల్లీని చెరయందుంచుట.

1800 వ సం॥ లో దండియాదాగును ఓడించుట.

1801:—నైజాము వలన పాలఘాటును గైకొనుట, కర్ణాటకమును స్వాధీనపరచుకొనుట, వజీరాలీ బనారసులో కలహించుట

1802:—పీష్వాతో బాసిన్ ఒడంబడిక, పీష్వావద్ద బుందెలుఖండులోని జిల్లాలను పుచ్చుకొనుట.

1803.—అస్సె, ఢిల్లీ, లాస్వారి-అరగాం యుద్ధము. అహమద్ నగరము, కావలిగిరి ఆగ్రా, అలిఘర్ పట్టణములను పట్టుకొనుట. బీరారురాజువలన కటకం, బాలేశ్వరము, పుచ్చుకొనుట.

1804:—ఢిల్లీ ముట్టడి-జయపూరును హోల్కారుదోచుకొనుట, టాంకురాంపురమును గ్వాలియరును పట్టుకొనుట. ఫరక్ బాదు. డీగుయుద్ధములు.

1805:-మొదటిభరతపురి ముట్టడి-గయక్వారువద్ద గుజరాతులోని జిల్లాలుతీసికొనుట.

## సర్ జార్జిబార్లో:—1805-1808

మార్క్విస్ కారన్వాలీసు. 1805 జూలై 30 తేదీని రెండవ పర్యాయము వచ్చిగాజీపూరులో చనిపోయెను.

1805:-సింధియా హోల్కారులతో సంధియొనర్చుట, జయపూరు బండిరాజులతో కలహము.

## లార్డుమింటో:—1806-1813.

1806:-వేలూరు సైనికుల అల్లరులు.

1809:-లో సర్ జార్జిబార్లో డేరాలగుత్తను కొట్టివేయుటవలన చెన్నపురిసైనికు లెదిరించుట జావా, మొరీసు, బోర్బన్ లంకలను జయించుట. ఆఘ్ఘనిస్థానమునకు రాయబారుల పంపుట.

## మార్క్విసు ఆఫ్ హేస్టింగ్సు:—1813-1823.

1814:—నేపాల్ యుద్ధము. ఖడ్ వాలు, కళింగజై తావులనుబట్టుకొనుట.

1815:—పీష్వాకును గయక్వారునకును విరోధము. గంగాధరశాస్త్రిని పందరపుర దేవాలయమందు త్ర్యంబకజీ చంపించుట. నీలగిరి, రామగిరి, మేలూను, కుమయూను, గర్వాలులను నేపాళరాజు వలన గ్రహించుట.

1816:—మెక్వానుయుద్ధము-హరిహరపురిని పట్టుకొనుట - త్ర్యంబకజీని చెరయందుంచుట.

1817:-కిర్కి-ధానూ-నాగపూరు-జబ్బలూప్వరు-మహితపూరు యుద్ధములు పూనాను పట్టుకొనుట. నాగపురియందు అప్పాసాహేబు రాజగుట చిట్టిహ్యాఘ్రము మరలన మృతుడగుట-కరీంఖాన్ ఇంగ్లీషువారికి లొంగుట.

1818:—కారిగాము యుద్ధము, ఆసీరు ఘరును పట్టుకొనుట, పీష్వా లోబడుట, వానివలన పూనా, కొంకణములను స్వీకరించుట, ఖాండవనమును, మాళవములను హోల్కారులవలన గ్రహించుట. టాల్నియరు కోట ముట్టడి - అప్పాసాహేబును చెరయందుంచుట.

1819:—ఆసీరుఘర్ ముట్టడి - కచ్ఛదేశమును సంతరించుట.

1820:—దక్షిణ కొంకణమును జయించుట.

1822:—బీజపూరు, అహమ్మదునగరములను జయించుట.

## జాన్ ఏడమ్సు:—

1823 సం. జన 19న వచ్చి 1-8-1823 లో వెళ్ళిపోయెను.

## లార్డు అంహరెస్టు 1823-1828:—

1823:—బర్మా యుద్ధము, సాపూరును బట్టుకొనుట.

1824:—సింగపూరును జయపూరు రాజావలన గైకొనుట రంగం, కిమెండెన్ సిరియం, డాలా, మార్తబాన్, మెర్గ్వాపట్టణములను బర్మావారివలన స్వీకరించుట.

1825:—మలాకాను జయించుట, డూనబ్యూ, ప్రోం, అరకాన్, మెలూన్, అస్సాములను పట్టుట.

1825:—పేగాము యుద్ధము, బర్మీలతో యాండబో వద్ద సంధి నొనర్చుటజూ టెవాయి, టెనాసరీంలను బర్మీలిచ్చుట రెండవ భరతపుర ముట్టడి. భరతపురరాజు యిచ్చుట.

## 1828-బట్టరువర్తు బేలీ:—

1828:—సం॥ మార్చి 13 న వచ్చి జూలై వెళ్లెను.

## లార్డు బెంటింకు. 1828—1835.

1828:—సహగమనమును దొలగించుట.

1830:— దక్షిణ కాబారును వశపర్చుకొనుట.

1832:—కంపెనీ చార్టరున వ్యత్యాసంబు లొనర్చుట.

1833:—చూ అరులను సంహారించుట.

1834:—కొడగుదేశమును రాజావలన గైకొనుట.

1835:—బల్లెకూటంబుల స్థాపనము.

## సర్ ఛార్లెసుమెట్కాఫ్. 1835—1837.

1835:—సం మార్చి 20 తేదీని వచ్చి 4-3-1837 న వెళ్లెను.

## లార్డు ఆక్లండు. 1837—1842,

1837:—హీరాటు యుద్ధము కక్షీత్రేయ సంధిగావించుట.

1838:—కాందహారు, గజనీ, కాబూలు యుద్ధములు, కీలతు ముట్టడి.

1839:—పర్వాను కలహము.

1840:—చీనా యుద్ధము, కర్నూలు జయించుట.

1841:—అక్బరుఖాను, కాబూలులో అల్లరులొనరించుట.

1842:—చీనావారితో సంధి, జలాలబాదును గాపాడుట, గండమక్కు. టెజీను, జగ్గలక్కులను బట్టుట.

## లార్డుఎల్లిన్ బరో. 1842—1844.

1842:—ఆఫ్గనులు, జలాలబాదు, కార్డుకాబూలులను ముట్టడించుట. ఇస్త్రీఫు కారికాలులను జయించుట.

1843:—మియానీ, హైదరాబాదు యుద్ధంబులందు, సింధుదేశంబుల గైకొనుట. మహారాజాపూరు, పన్నియూరు యుద్ధంబులుచేయుట.

1844:—మహారాష్ట్రులతో ఒడంబడిక నొనరించుట.

## విల్ బల్ ఫోర్సుబైర్డు:—(1844)

ఈతడు 15-6-1844 న వచ్చి 23-6-1844 న వెడలిపోయెను.

## సర్ హెన్రీహార్డింజి:—(1844-1848)

1844 :— మొదటిసిక్కుయుద్ధము.

**1845:**—ముడ్కి, ఫిరోజిషాయుద్ధములు. శ్రీరామపురము, ట్రాంకిబారులను కొల్చి కొనుట

**1846:**—సొబ్రాయిన్-అలివాల్ కలహములు జలంధర్, ద్వ్యాబులను గెల్చుట.

**1847:**—నర, శిశు హత్యలను అంతరింపచేయుట.

## లార్డు డల్ హౌసీ:—1848-1856

**1848:**—రామనగరిముట్టడి, ముల్తాను వశపర్చుకొనుట, సతారా గైకొనుట.

**1849:**—జిలియన్ వాలా, గుజరాతుయుద్ధములు, సిక్కులవలన పాంచాలమును పొందుట. బుందేలుఖండమును జయించుట.

**1851:**—ఇండియాయందు, రైలుమార్గములు, తంతిసమాచారములు, ఏర్పరుచుట, టపారూకలను క్రొత్తగా నేర్పరచుట. పరీక్షలను నియమించుట

**1852**—రెండవబర్మా యుద్ధము. పెగూస్వాధీనమగుట, మార్తబాను, రంగూనులను బట్టుకొనుట.

**1853:**—కంపెనీ చార్టరులో మార్పులు గలుగుట, ఉత్తర కాచార్, ఉదయపురంబుల గెల్చుట

**1854:**—నాగపూరును గైనుట.

**1855:**—సంతాలులు యెదిరించుట.

**1856:**—అయోధ్యను వశపర్చుకొనుట, పాఠశాలలను ఏర్పాటుచేయుట.

## వైకౌంటు కానింగు 1856-1861:—

**1857:**—పారసీక కలహము, బంగాళాసైనికులు తిరుగబడుట. ఢిల్లీ లక్నోలు జయించుట.

**1858:**—ఇండియా రాజ్యపాలనను శ్రీ విక్టోరియా మహారాణిగారు స్వీకరించుట.

**1860:**—చెన్నపురి విద్యా నిబంధనయును, రాబడి పన్ను చట్టమును సృజించుట.

## లార్డు ఎల్జిన్ 1861-1864:—

ఈయన కాలమందేమియు గొప్ప విశేషములు జరుగలేదు.

## సర్ జాన్ లారెన్సు 1864-1868:—

**1865:**—రాబడి పన్ను చట్టమును తొలగించుట, రిజిస్ట్రేషను ఆక్టును నిర్మించుట.

**1868:**—అబీసీనియా కలహము.

## లార్డు మేయో 1869-1872:—

**1872** లో ఈయన పోర్టు బ్లేరులో చరగానివలన చంపబడుట.

—సశేషము.

---

# బాలవిజ్ఞానము

## మిడతంభట్లు

(తేజోమూర్తుల మల్లికార్జునుడు.)

అనగా అనగా ఒకవూళ్లో ఒక బ్రాహ్మణుడు వున్నాడు. అతనిపేరు "మిడతంభట్లు" అతడు చాలా బీదవాడు. ప్రశ్నశాస్త్రం బాగా తెలుసునని ప్రతీతి. ఒకనాడు ఒక రైతు

వచ్చి "బాబూ మా వరి ఆకుమడి ఎండిపోతోంది, వర్షం ఎప్పుడు కురుస్తుందండి" అని అడిగాడు. రేపు మీామళ్లో కురుస్తుంది వెళ్లు అన్నాడు. రైతు యింటికిపోయేడు. పేరు గొప్పదేకాని చదువులేదు. అక్షరజ్ఞానం అంతకు ముందేలేదు. మిడతంభట్లుకి. చేయవలసిందేమిలేక ఆరాత్రి తెల్లవార్లు కావిడితో నీళ్లుమోసి ఆకుమడి తడిపేడు. ఆ మర్నాడు ప్రొద్దున్న ఆరైతు పొలంలోకి వెళ్లి చూసేసరికి తడిసివుంది. ఆహా! బేమ్మడి పంచాంగం మాగొప్పది "అనియింటికి వెళ్ళేడు. ఈ సంగతి తెలిసి ఒకచాకలివచ్చి "బాబూ మా గాడిద పారిపోయి యీాయాలకి మూడువాల్గయింది. అంతా తిరిగినాను గాని దానిజాడ తెల్లేదు. తమరు గొప్ప కావందులని వుస్నదున్నట్టు సెప్తారని యిని వచ్చినాను బాబయ్యా" అని మొక్కపెట్టుకున్నాడు. సరే రేపురాత్రికి వూరిబయట నూకాలమ్మగుడిదగ్గర కట్టేసివుంటుంది పోయితెచ్చుకో అన్నాడు. ఆచాకలి యింటికి పోయేడు. ఆరాత్రి తెల్లవార్లు ఆ గాడిదకోసం వెతికి పట్టితీసుకొనివచ్చి నూకాలమ్మ గుడిదగ్గర కట్టేసి యింటికి వెళ్ళిపోయేడు. ఆలాగే చాకలివాడు రాత్రివచ్చి చూచేసరికి గాడిద కట్టేసి వుండడముచూచి చాలాసంతోషపడి బ్రాహ్మణుని పొగుడుతు ఆ గాడిదను తోలుకొని యింటికి పోయేడు.

ఆ దగ్గరవూళ్లో ఒక జమీాందారుగారు వున్నారు. వారియింట్లో మంచిఖరీదుగల ముత్యాలహారం యెవళ్లో దొంగిలించేరు. ప్రశ్న చూపించడానికని "మిడతంభట్లు"ని పిలిపించేరు. నాకు మూడురోజులు వ్యవధియిస్తే చెపుతాను అని శలవుతీసుకొని యింటికి వచ్చేడు. యేమి చెయ్యడానికి తోడలేదు. ముక్కో చెవో కోసేస్తారు ప్రశ్న చెప్పకపోతే అని విచారించుతూ నీళ్లరేవుదగ్గర కూర్చుని "ముక్కో, చెవో, ముక్కో, చెవో" అని పలవరిస్తున్నాడు. అలా రెండురోజులు గడిచింది. ఆ జమీాందారుగారియింట్లో "ముక్కు, చెవి" అనే యిద్దరు దాసీలు వున్నారు. ఆరోజున కర్మంజాలక ఆత్రోవనే వెడుతుండగా "ముక్కో, చెవో" "ముక్కో, చెవో" అనే మాటలు వినబడ్డాయి. గబగబ పరుగెత్తుకొనివెళ్ళి ఆ బ్రాహ్మడికాళ్లమీాదపడి "అయ్యా! మాతప్పు క్షమించండి. మేమే ఆ ముత్యాలహారంతీసి మండువాలో భోషాణంక్రింద దాచేము" అని చెప్పేశారు. "ఆడబోయినతీర్థం ఎదురయినట్లు" సంతోషించి "సరే మీాకేమి ఫరవాలేదు. ఈనేరము మీామీాదకు రాకుండా కాపుచేస్తాను" అని యేవోరెండు ప్రగల్భాలు చెప్పి తిన్నగా రాజుగారియింటికివెళ్లి ప్రశ్నచూచేవాడిలాగ నటించి "మేషం మేకల్లో కలిస్తే వృషభం ఎద్దులోకలిసింది, మకరం మధ్యాహ్నం అయితే, కుంభం విస్తట్లోకి వస్తుంది" అని వేళ్లు అటుయిటు లెక్కపెట్టి మీాహారం భోషాణంక్రిందవుంది. చూసుకోండి" అన్నాడు. రాజుగారు బంట్రోతులచేత వెతికించేరు. హారందొరికింది. రాజుగారు చాలాసంతోషించి ఆబ్రాహ్మడికి చాలాభూములు బహుమతిచేశారు.

ఒకనాడు రాజుగారు బ్రాహ్మణ్ని కూడా షికారుకు పొలంలోకి తీసుకువెళ్లేరు. అక్కడ ఒక మిడత తూలి రాజుగారి చేతిలో పడింది. పడగానే గుప్పిలిపట్టి "నాచేతిలోనిదేమిటండీ?" అని ప్రశ్నించినాడు. ఆబ్రాహ్మడికి ఏంచెప్పాలో తోచలేదు. "నేను

యిన్నాళ్లకు రాజుగారికి దొరికిపోయేనే" అనివిచారించుతూ తనపేరు "మిడతంభట్లు" కనక "ఇన్నాళ్లకి మిడతంభట్లు మీకుదొరికేడు" అన్నాడు. రాజుగారు సరిగానే చెప్పేడు అనుకొని మిడతను వదిలేసేరు. ఈరాజుగారిదగ్గరవుంటే యీలాగే యేవేవో అడుగుతూవుంటాడని ఒకనాడు తనయింటికి నిప్పుపెట్టుకున్నాడా బ్రాహ్మణుడు. లబో లబోమని యేడుస్తూవుంటే రాజుగారువెళ్లి పరామర్శచేసి వూరుకో ఏంచేస్తాం అని ఓదార్చేరు. "అయ్యో నా పంచాంగాలు కాలిపోయేయి. నన్ను ఎవరైన ప్రశ్నఅడిగితే యేలాచెప్పను." అని వెక్కి వెక్కి యేడ్చేడు బ్రాహ్మణుడు. "పోనీలే నీ పంచాంగాలు కాలిపోతే నీవేలా ప్రశ్న చెపుతావు గనక నిన్ను మేమెవరము అడగములే" దని వూరుకోబెట్టేరు. "బ్రతుకు జీవుడా యని మిడతంభట్లు మాట నిలబెట్టుకొన్నాడు. కథ కంచికెళ్లింది. మనంయింటికొచ్చేం.

---

# ఉపాధ్యాయుల యిక్కట్లు

యస్. సి. హెచ్. అప్పలాచార్యులు.

ఓ ఉపాధ్యాయ సోదరీ సోదరమణులారా!

1942 సం॥రము జూన్ నెల ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్యా పత్రికలో శ్రీ. యన్. వి. యస్ గారు "కడగండ్లు" అనే వ్యాసము వ్రాసి ముగించుచు యెవరికి తోచిన సలహాలు యీ పత్రికాముఖమున ప్రకటించమని కోరి యున్నారు. నాకు తెలిసినంతమట్టునకు నేను కొంత సలహా యిస్తున్నాన యిందలి తప్పులను క్షమించ కోరెదను. ఇప్పుడు ప్రభుత్వ నిబంధనలు ప్రతి స్కూలు సంపూర్ణ (5 తరగతులతో కూడిన) పరశాల కావలయుననియును, అందుకు తగిన మాష్టర్లతోను, పిల్లలతోను వృద్ధిగానుండ వలయుననియును, మాష్టర్ల నుబట్టి సరాసరి హాజరు రావలెననియును ఒకటవ సంఖ్యను బట్టి పై తరగతులలో విద్యార్థులసంఖ్యలు సంబంధము ప్రకారము సరిపోవలయు ననియును గ్రామ జనాభాను బట్టి బాలబాలికలు ఆది ఆంధ్రులు బడిలో చేరవలయుననియును, ఆదిఆంధ్రులు బాలికలు, లేని స్కూళ్లు యెత్తివేయబడునని యును, పై నిబంధనలు పాటించని స్కూళ్ల గ్రాంట్లు కోతలున్ను లేదా అట్టిస్కూళ్ళను యెత్తివేయుటగూడా జరుగుననియు ప్రభుత్వము ఆర్డర్లు ప్యాసుచేసెను

పై నిబంధనలుబట్టి చాలా స్కూళ్లకు గ్రాంట్లు కోతలున్ను, స్కూళ్లను యెత్తి వేయుటయున్ను జరుగుచున్నది. యిందు అధికారులు మిగిలిన స్కూళ్లలో బాలబాలికలసంఖ్యలు వృద్ధియున్ను, యిది వరకు కంటె యిప్పుడు విద్యను గురించి అధికద్రవ్యము ఖర్చుఅగుచున్నందున అట్టి స్కూళ్లు యెత్తివేసినను నష్టముండదని తెలుపుచున్నారు. ఇందువల్ల ఆ గ్రామములో యిదివరకు జరుగుచున్న విద్యా సౌకర్యము యికనుండి ఆగ్రామస్థులపిల్లలకు లేదు సరేగదా ప్రస్తుతము ఆగ్రామ స్కూలు మాష్టరు బ్రతుకునకే ముప్పువాటిల్లు

చున్నది. ఇట్లు స్కూళ్లుపోవుటను ఉపాధ్యాయ సంఘములు గుర్తించునట్లు కనబడుటలేదు. ఎంతసేపు వారిగ్రాంట్లు లేక జీతముల హెచ్చింపునకే పాటుబడుచున్నారు. ఈనిబంధనలు ఉపాధ్యాయుడు ఆచరించుటకును, పైనిబంధనలప్రకారము తనస్కూలులో యెట్టిలోపమున్నను కనిపించకుండా నుండుటకు ఆబడియుపాధ్యాయుడు యెన్నియన్యాయములు చేయుచూ యెన్ని అబద్ధములు అధికారులతో చెప్పుచూ, తనబడికి దినదినము కలుగుచున్న గండములను తప్పించుకొనుటకై యెన్ని యిక్కట్లకు లోనగుచున్నారో ఉపాధ్యాయలోకమునకే విశదము. ఇంత కష్టపడినను ఏదోలోపమువల్ల గ్రాంట్లు కోతలు జరుగుచున్నవి.

ఈ నిబంధనలు ఉపాధ్యాయుడు ఆచరించుటకు కష్టములు:— గ్రామస్థులు వారి పిల్లలను బడియీడు రాగానే బడిలో వేయకుండా నున్నారు. ఏకొలదిమంది యో వారి పిల్లలను బడిలో ప్రవేశపెట్టియు వారి వారికి పనులున్నప్పుడు మాష్టరెంత గోల పెట్టినను వినక ఆ పిల్లలను వారి పనులకు తీసుకొనిపోయి గైరుహాజరును చేయుచున్నారు. (యిందువల్ల అధికారులుచేయు హఠాత్తు తనిఖీలకు హాజరు తక్కువగా వచ్చుటయును సరాసరి తగ్గుటయును ఒకే తరగతిలో చాలాకాలము నిలువయుండుటయును, కలుగుచున్నది.) ఇట్టి వారు వారమునకు గాని నెలకు గాని 1, 2 రోజులు మాత్రమే హాజరగుదురు. మరి కొందరు వారిపిల్లలను ఏ ఒకటి, రెండు సంవత్సరములో చదివించి (1, 2 తరగతులువరకు చదివించి) బడిని మాన్పించెదరు. (యిందువల్ల ఒకటవ తరగతినుండి పై తరగతికి పోవుకొలది సంఖ్యలు తగ్గుటకు కారణమగుచున్నది.) ఇందువల్ల గ్రాంట్లు కోతలగుచున్నవి. గ్రామస్తులు వారిపిల్లలను క్రమముగా పంపకుండా యిట్లు బడి మాన్పించిన ఉపాధ్యాయు డేమిచేయగలడు? ఆలోచించవలెను. ఇప్పుడుయిచ్చుచున్న గ్రాంటులో ఉపాధ్యాయులు తమ జీవనము గడపలేనప్పుడు పై రూల్సు ననుసరించి బడివృద్ధికాలేదని వారి గ్రాంట్లు కోతలు పడినవారు యెట్లు జీవించగలరో ఆలోచించవలెను. అభివృద్ధిలేదని స్కూళ్లు యెత్తివేసిన ఆ యుపాధ్యాయుని బ్రదుకు యెట్లు ఉండునో ఆలోచించవలెను. ఇట్టి కష్టములు ఉపాధ్యాయునికి కలుగకుండుటకుగాను ఉపాధ్యాయ సంఘములు, ఉపాధ్యాయులు అందరూకలసి ఒక సంఘముగా ఏర్పడి యీ దిగువ వివరించిన సూచనలు అమలు పరుచుటకు ప్రభుత్వమును కోరి ఉపాధ్యాయుల కష్టములను బాపుటకు ప్రయత్నించవలెను

అవి యేవనగా :—హైస్కూళ్ల వలె గ్రామస్థులు వారిపిల్లలకు బడియీడు (5సం॥ 6 సం॥లు) రాగానే ఆగ్రామబడిలో చేర్చుకొను కాలము (జూన్–జనవరి నెలలు)లో చేర్చవలెను. అట్లు చేరిన ప్రతివారును ఆ స్కూలులోవున్న తరగతులు పూర్తిచేయనిది బడి మానరాదు. బడియున్న దినములలో గైరుహాజరుకారాదు. అట్లు నడచుకొనని తలిదండ్రులపై ప్రభుత్వము చర్య జరిగించి సక్రమముగా వారిపిల్లలను ఆ గ్రామబడికి పంపి విద్య చెప్పించునట్లు చేయుటకుపై సంఘములు పాటుపడవలెను. ప్రభుత్వము అట్లు నిర్బంధముచేయుటకు

ధనములేదనిన ఇప్పుడున్న పాఠశాలలకైనను యీధనముతోనే నిర్బంధము యేర్పరచి క్రొత్తగా తెరచు పాఠశాలలకు పైనిబంధనలు అనుసరించునని ఆయాగ్రామస్థులు ఒప్పుకొంటేగాని ఆపాఠశాలలకు రికగ్నిషనులు యివ్వరాదు. ఇట్లు ప్రభుత్వముచే బాధ్యతవహింపించి వారివారిగ్రాంటు లేక జీతములకు ఉపాధ్యాయలోకము పాటుపడవలెను. గాని మొట్టమొదట జీతములకు లేక గ్రాంట్లు హెచ్చింపుకు పాటుపడిన పైనిబంధనలు అనుసరించలేదని స్కూళ్లను యెత్తివేసిన జీతములులేక గ్రాంట్లుహెచ్చించినందువల్ల ఉపాధ్యాయులకు మేలుకలగదు. కావున ఉపాధ్యాయలోకము, బద్ధులు నిలిచి అభివృద్ధిపొందుటకు ప్రయత్నించవలెనని నామనవి.

---

# రాట్న సేవ

కవికుమార - దాస్యం అప్పారావు.

కం॥ శ్రీ వెలయున్ జిరతరముగ
　సేవాపరతంత్రసర్వజీవాళి నిరం
　తావశ్యకతన్ రాట్నపు
　సేవను సలుపంగ దేశ శ్రీయప్రదమున్.

గీ॥ రాట్నమున్ ద్రిప్పుచున్నట్టి ప్రజల కెల్ల
　నాయురారోగ్య భోగభాగ్యాదు లొదవు
　నైహికాముష్మిక సుఖాదు లందఁ గలుగు
　నీప్సితార్థలాభము గల్గు పృథ్వియందు.

గీ॥ రాట్నసేవన మొనరించు ప్రతిగృహమ్ము
　నిత్యలక్ష్మీకటాక్షమై సత్యశాంత
　ధర్మభూయిష్టమై యుర్విఁ దగ వెలుంగు
　భారతీయుల కీసేవ భవ్యవృత్తి.

మ॥ శ్రవణానందము నైకమత్యము ప్రజా । స్వాతంత్ర్య భాగ్యోత్సవం
　బవనిన్ గూర్చెడు రాట్నపుం బ్రణవ ది । వ్యధ్వానమున్ విన్న మా
　నవమాత్రుల్ మృదుశబ్దవత్సలత వీ । ణావేణు నిక్వాణ మా
　ర్దవమున్ విన్నను పొందరాగతిని క । ల్యాణప్రదామోదమున్.

ఆ॥ వినుట కింపులేని బెకబెకధ్వను లిచ్చు
　మరలు వచ్చె దేశమాన మడఁగె
　కానఁ బ్రణవయుక్తగానంబు సేసెడు
　రాట్నసేవనంబు రమ్యసరణి.

గీ॥ ఖండితాఖిల సేవకాఖండదోష
యములసత్త్వవిశేష విద్యాభిలాష
భరతదేశప్రభూష తత్త్వజ్ఞతోష
రమ్యతరభాషయా తల్లి రాట్నసేవ.

సీ॥ గాఢపరివృతాజ్ఞానాంధకార కై । రవశత్రుబింబంబు రాట్నసేవ
కామాది షడ్గుణ ఘనతరాంభోద వా । ర శ్వసనాహతి రాట్నసేవ,
ఘోరభయంకరాకారసంసార నీ - రనిధి తరణనావ రాట్నసేవ
దౌర్జన్య బహుమత్తదంతావళాళి హ ర్యక్షు భీకరమూర్తి రాట్నసేవ,

గీ॥ రాట్న తత్త్వజ్ఞశేఖరప్రకర మానస । వ్యధాభీలతర దవజ్వాలనపటల
ప్రావృషాధికవర్ష ప్రభావ కలిత । రమ్యతరభావ సూవె యీరాట్నసేవ.

"స. శే."

---

# మానవజీవితము

(విద్యాన్ వేమూరి చక్రధరస్వామి)

బ్రహ్మచే సృష్టింపఁబడిన యెనుబదినాలుఁగు లక్షల జీవరాసులలో మానవ జన్మ యత్యుత్కృష్టత వహించును. మానవుడను శబ్దము మనువు నుండి యుద్భవించినట్లు తేలుచున్నది మనువు బ్రహ్మవంశీయుఁడు. అటుగాకపోయినను మన మందఱము బ్రహ్మసృష్టిలోనివారము కాన మనము సైతము బ్రహ్మవంశీయులము, పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సృష్టి బ్రహ్మసంబంధము కాఁగా నధిక మెద్దియని యూహ పొడమవచ్చును. కొంచె మాలోచించిన నా సందియ మీడేఱును. ఎట్లన మానవేతరసృష్టికిని, మానవసృష్టికిని గల తారతమ్యము మనకే తెలియుచున్నది. "మన్" అను ధాతువునకు "తలఁచుట" యని యర్థము కాన క్రమక్రమ జ్ఞానాభివృద్ధి గలవారు మానవులనియు, నట్టి ప్రతిభ మానవేతరులందుఁ గానంబడదనియు, మనకుఁ బ్రత్యక్షానుభవము. అట్టి జ్ఞానాభివృద్ధియే లేనిచో మానవులకును, మానవేతరులకును, నాహార నిద్రాభయములు సమానములు గాన "జ్ఞానేనహీనాః పశుభిస్సమానాః" అనునట్లు మృగపక్ష్యాదులతో సమానముగాఁ బోల్చవచ్చును. అట్లు పోల్చుటకొక చిక్కు కలదు. ఎట్లన పక్షులు వేయి సంవత్సరముల క్రిందట తమ గూండ్లను నిప్పటి వలెనే నిర్మించుకొనుచుండెను. ఇఁక ముందు వేయేండ్లకు నేమాత్రము మార్పులేక యిట్లే నిర్మించుకొనవచ్చును. మానవుఁడట్లు కాదు. మొట్ట మొదట నదులలో దొరకిన చేపలను, పచ్చిమాంసమును, నాహారముగాఁ గొనుచు నెముకలను, చెకుముకిరాళ్లను, నాయుధములుగా నుపయోగించుచు చెట్టు తొఱ్ఱలయందో, పర్వత గుహాలయందో, వాసమేర్పఱుచుకొని పత్రముల వస్త్రములుగా నుపయోగించుకొనుచుండెడివారని చరిత్రవలనఁ గానంబడుచున్నది. ఇప్పుడు మనము చూతమన్నను నట్టివాఁడొక్కఁడు కానరాఁడు. ఇప్పుడు మనము నివసించు సౌధములు, మనము ప్రయాణించు నయోమార్గ ధూమనౌకలు, వాయువిమానములును, వార్తల నంపు తంతి మార్గములును, ధనికులు తమ సౌధములందుంచుకొని విదేశవార్తల విని యానందించుట కుపయోగపడు రేడియో యంత్రములును, మానవులిండ్లయందుపయోగించు విద్యుద్దీపములును, చూచి యానందించు చలన చిత్రములును, ఇంకను నెన్నియో యంత్రములు మానవుని యూహాశక్తిచేఁ గనిపెట్టఁబడినవేగదా? కావున మానవుఁడు పశుమాత్రుఁడు కాఁడు. కాకపోయినను నొక్కొక్కపుడు తన విద్యుక్త ధర్మము నాచరింపక స్వార్థాభిలాషియై తన సార్థకనామమునకు, నత్యుత్కృష్టతకు, దూరుఁడగుచున్నాఁడు.

కాబట్టి మానవుఁడు బ్రహ్మచే సృష్టింపఁబడిన ప్రకృతిని నాదర్శముగాఁ గొని తన లోటుపాటులను దిద్దుకొనుచు భగవంతునిచేఁ బ్రసాదింపఁబడిన వైదికధర్మముల నాచరించుచు జీవితమును ధన్యమొనరించుకొనవలయును. వైదికము అనఁగా యజ్ఞయాగాది క్రతువులు గావు. వేదములందలి ధర్మములు; నిర్ధనికుఁడు సహిత మాచరింపవచ్చును. బుద్ధునిచే సాకరింపఁబడి దేశదేశాంతరములకును, ద్వీపాంతరములకును, బ్రాకినవి వేదధర్మములే, "అహింసా పరమోధర్మః" "సత్యం వద" "ధర్మంచర" "నానృతంవదేత్" మొదలగు వాక్యములలోని సారాంశమునే పూర్వులాధారముగాఁ గొని తమ జీవితములను ధన్యవంతములుగా జేసికొనిరి.

పూర్వులలో శిబిచక్రవర్తి తనధర్మమును బరీక్షింపశ్యేన కపోతాకారములతో వచ్చిన నింద్రాగ్నులకుఁ దనమేని కండల నొసంగి యహింసను బ్రకటించెను.

హరిశ్చంద్రుఁడు సత్యమును నిలుపుటకై రాజ్యమును గోలుపోయి వారణాశియందు భార్యాపుత్రుల వరవుకు ధనమునకై యమ్మి తానొకయంత్యజునకు నమ్ముడుపోయి పలుబాములకుఁ బాలయ్యెను.

బలిచక్రవర్తి తనదగ్గఱకు వచ్చిన యాచకుఁడు శ్రీమన్నారాయణుఁడని తెలిసియుఁ దనరాజ్యమును హరించుటకై వచ్చినాఁడని పలుమారులు శుక్రాచార్యులచే బోధింపఁబడియుఁ, దనధర్మమును (సత్యవర్తనము) వదలడయ్యెను.

ఈవిధముగాఁజెప్పఁ బూనిన పితృవాక్యపరిపాలనమునకై యరణ్యములకేగిన శ్రీరాముఁడు దేవతల యాయుధములకై తనవెన్నెముక నర్పించిన దధీచి మొదలగు వారెందఱో కలరు. వారుగతించి యెన్నియుగములైనను వారి యశశ్శరీరములు మాత్ర మీప్రపంచమందా ప్రళయాంతము నిలిచియుండును. కాన మానవుఁడైన వాఁడుదారినైన నాదర్శముగాఁ గాని "ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచుం ధృత్యున్నతోత్సాహులై, ప్రారబ్ధము లుజ్జగింపరుసుమీ" యనునట్లుతనశరీరమును "పరోపకారార్థమిదంశరీరమ" నునట్లు లోకోపకారమునకై వినియోగింపవలెననెడి కార్యమునకుఁగడంగి తత్కార్యముసాఫల్యమగు వఱకు వెనుదీయక తనయశస్సు ముల్లోకముల వ్యాపింపఁజేయఁయత్నింపవలయును.

అట్లుప్రయత్నించిన యతఁడు మాతృదేశసేవకుఁడై లోకముచేఁ గొనియాడఁబడుచు వన్నెకెక్కును. దేశసేవకుఁడగుటయేగాక "మాతాపిత గురుర్దైవ" మ్మనునూక్తి ప్రకారము మాన్యులలోన గ్రగణ్యయు, సతిపతివ్రతయు, వీరమాతయు, ననేక వేదవేదాంతేతిహాసాదుల జన్మకారణయు, నగు భారతమాతను పూజించిన వాఁడగుచున్నాఁడు. అంతియకాదు. అతనిని భగవంతుఁడనికూడ చెప్పనొప్పును.

ఏమఱ నెవఁడు స్వార్థవిరహితుఁడై భగవన్మయమైన ప్రపంచమునేపూజించునో యాతని యోగక్షేమములనే నూహించుదునని "అనన్యాశ్చిన్తయన్తోమాం, యేజనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అని భగవద్గీత చెప్పుచుండుటచే మానవుఁడు తనతృహచ్ఛిద్రములను గుఱించి కాని, భుక్తి ముక్తులను గుఱించి కాని ప్రయాసపడనక్కఱలేదు. స్వార్థవిరహితుఁడైన వానికి వలయుపదార్థమొకటియు లేదు అట్టివాఁడు జనులచే నుత్కృష్టుఁడై యెన్నబడుననుటకు ననుమానములేదు. ఎపుడు మానవుఁడున్నతస్థానము వహించునో యపుడే "యద్యద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవవా, తత్తదేవా వగచ్ఛత్వం మమతేజోంశసంభవమ్" అను భగవద్గీతలోని శ్లోకప్రకారము భగవంశ కలవాడై యందఱిచేఁ బూజింపఁబడు పరిస్థితిలోనికి వచ్చును. భగవద్గీతను ప్రమాణముగా గొననగునాయన భగద్గీత మూలము నాధారముగాఁగాని త్రిమతాచార్యులని ప్రఖ్యాతివహించిన రామానుజ మాధ్వశంకరాచార్యులువారి వారిమతములైనవిశిష్టాద్వైత ద్వైతాద్వైతముల కనువగునట్లు వ్యాఖ్యాన మొనర్చుటచేతను, నాధునిక మహానుభావులును, దేశోద్ధారకులు, తిలక్, మహాత్మాగాంధి, కాశీనాథుని నాగేశ్వరరావు మొదలగువారు వారి వారికి తోచినసదుద్దేశములతో వ్యాఖ్యానమొనర్చుటచేతను దాని ప్రాముఖ్యముచెప్పకయే చెప్పుచున్నది. కాన నవశ్యము ప్రమాణముగాఁ గొననగును. కాఁబట్టి యిట్టి యుద్గ్రంథములలోని విషయముల నాదర్శముగాఁగొని మహానుభావుల పవిత్రమార్గమున ప్రయాణించిన పురుషుఁడు తానాచరింపవలసిన చతుర్విధ పురుషార్థముల త్వరలో సాధించి గమ్యస్థానము చేరఁగలఁడు.

జీవితమును ధన్యవంత మైనదానిగాఁ జేయ యత్నించు మర్త్యుఁడు "నేను వేదముల నెఱుంగను గదా? వేదాంతముల నభ్యసింపలేదుగదా? విద్యను

బాల్య చేష్టలచేఁ జక్కఁగా శిక్షితుఁడనై నేర్చుకొనఁజాలనైతినిగదా ? వేదాంతార్థ మెట్లు నాకు బోధపడగలదు? నేనీపాపములనుండి తరించు తెరువెయ్యది ? పుణ్య యాత్రలఁ జేయుదమన్న ధనశూన్యుఁడనే ! నడచి ప్రయాణము చేయుదమన్న శక్తిరహితుఁడనే ! పుణ్యగ్రంథముల పారాయణము చేయుదమన్న విద్యాగంధ శూన్యుఁడనే ! దేవుని ధ్యానింతమన్న నస్థిరమనస్కుఁడనే! యని పరితపించుచుఁ దనకాల మీయాలోచనలచే నాశనముచేసికొనక "శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః । పరోపకారః పుణ్యాయ ; పాపాయ పరపీడనమ్"ను శ్లోకార్థము ప్రకారము తన శరీరమును బరోపకారమునకే వినియోగింపవలయును. ఈ విషయమును బోధింపఁదలఁచి దేవపూజవ్యాజముగా వేమన "అరయదేవదేవు నారాధనముచేయు నష్టవిధ సుమంబుల మరవలయు । దీనిఁ దెలిసికొనని దేవుని పూజలేల। విశ్వదాభిరామ వినురవేమ"యని యష్టవిధములైన పుష్పములతో దేవుని పూజింపవలయుననెను. అష్టవిధములైన పుష్పము లెవ్వియో యను సందేహము పొడమఁగా మఱియొక కవి "అహింసాప్రథమం పుష్పం। పుష్ప మింద్రియ నిగ్రహః సర్వభూత దయాపుష్పం । క్షమా పుష్పం విశేషతః । శాంతి పుష్పం తపః పుష్పం । ధ్యానపుష్పం తథైవహి । సత్యమష్టవిధంపుష్పం । విష్ణోః ప్రీతికరంభవేత్" అని తెలిపెను. ఎన్ని విధముల జూచినను పారమహిమాన్వితంబగు నాంధ్రభాషాను తల్లియే బదియాఅక్షరములకుఁ గట్టుబడినరీతిగాను "దంతిమునుగులోనఁ దక్కిన జంతుచయంబు నడుగుతెల్ల నడఁగియుండు "నట్లు ధర్మ కోటులన్నియు లోనగు నిదగుణయహింస కింత నిజము" అని యహింస కన్నిధర్మములు లోఁబడుచున్నవి. ఇట్టి యహింసకు, దేశసేవకు, లోనై మనకన్నుల యెదుటనే యెందఱో స్వార్జిత ధన ప్రాణమానముల గోల్పోవుచున్నారు పరోపకారమును బ్రాతిపదికగా నిడికొని దేశోద్ధరణకై తనకిప్పటికి 74 వత్సరముల ప్రాయము వచ్చినను, ఎన్నియోపర్యాయములు కారాగారబద్ధుఁడైనను, మహాత్ముఁడని ప్రఖ్యాతివడసిన మోహనదాసు గాంధీగారు తన యుద్యమము నిప్పటికి మానలేదుగదా? ఒక యింటియందు నలుగురున్న పరస్పర స్పర్థలతో నుండి యజమాని యిష్ట ప్రకారము నడుచుట కనుకూలింపరుగదా! అట్టి పరిస్థితియందు ననేకమతములతోను, భిన్న భిన్న యాచారములతోను, వివిధ జాతులతోను నిండియున్న భారతదేశమందలి ప్రజలనందఱను భారతజాతి ప్రజలనుగా, ననగా నేకాభిప్రాయులనుగాఁ ద్రిప్పినాఁడన్న నాతని కెట్టి శక్తి సహాయమైనది ? ప్రభుత్వముతోఁ బెనఁగులాడుట కెట్టి శక్తి యేర్పడినది ? అన్నిటికి పరోపకార చింతయే ! దేశసేవకై శరీరమును వినియోగింప వలయుననెడి పట్టుదలయే ! భగవ దుపదేశమగు గీతయే ! కాఁబట్టి మానవుఁడు మహానుభావులగు పూర్వుల ప్రవర్తననుగాని, ఆధునికులగు గాంధి మహాత్మునివంటివారినిగాని, యాదర్శముగాఁ గొని యట్టి ధర్మాచరణములందు మనస్సును చొప్పించి స్వార్థాభిలాషిగాక "తాకరాకు తాకరాను" అనెడి మంత్రమును మఱచి పోతనగారు చెప్పినట్లు "కలుగనేటికిఁ దల్లుల కడుపుచేఁటు" అను దానిని స్మరించుచుఁ దన యజ్ఞానపిశాచమును వివేకమను మంత్రము దూరముగా వెడలఁగొట్టినయెడల తాను పోయినను దన యశశ్శరీర మాచంద్రతారార్కము ముల్లోకములకు దీవియగాఁ బ్రకాశించును. ఇట్టివాని జీవితమే మానవజీవితమని చెప్పనొప్పును.

---

# భూగోళము - ప్రశ్నోత్తరములు.

6 వ తరగతి

(అగష్టు సంచిక తరువాయి)

వేదాన్తము - శ్రీనివాసాచార్యులు.

## — ఎడారి - ఒంటెవాఁడు - ఈజిప్టు - నైలునది —

(12) ప్రపంచములోని గొప్పఎడారి పేరేమి? ఏర్పడుటకు గలకారణములెవ్వి?

జ:— ఆఫ్రికాఖండములోని సహారా ఎడారి.

1 ఎడారి ప్రదేశము సముద్రమునకు దూరముగా నుండుట.

2 ఎడారి ప్రదేశమందు నదులు లేకుండుట 3 ఋతుపవనములు వీచు ప్రదేశము గాకుండుట 4 భూ ప్రదేశమునుండి పొడిగనుండు ఈశాన్యవ్యాపార పవనములు వీచుట 5 పడమటి భాగమందు సముద్రమునుండి వీచు గాడ్పులను ఆటంక పరచుటకు యెత్తగు పర్వతములు లేకుండుట.

(13) ఒయాసిస్సులననేమి? అచ్చట పండుపంటలెవ్వి?

జః— సహారా యెడారిలో గల నీటిపట్టులకు ఒయాసిస్సులని పేరు. ఇచ్చట గోధుమలు - బార్లి - జొన్నలు పండింతురు.

ఖర్జూరపుచెట్లు మెండు.

(14) బిడారు వర్తకులననేమి? వారు విక్రయించు సరకులెవ్వి?

జః—ఎడారిలో గుంపులు గుంపులుగా బయలుదేరి వర్తకము చేయువారికి బిడారువర్తకులని పేరు. విక్రయించు సరకులు దంతములు- ఉష్ట్రపక్షి యీకలు- లవణపదార్థములు- ఖర్జూరపుకాయలు- అకేషియా అను జిగురుపదార్థము.

(15) సైమూను - ఎడారిఓడ అననేమి?

జః— ఎడారియందలి ఇసుకతుపానులకు సైమూనులని పేరు. బిడారి వర్తకము ఎడారియందు ఒంటెలతో జరుగును గాన ఒంటెకు "ఎడారిఓడ" యని పేరు.

(16) ఎడారి వాసులనుగూర్చి వ్రాయుడు?

జః—ప్రజలు ఎడారియందుగల ఒయాసిస్సులవద్ద కాపురముందురు. మిద్దెయిండ్లు ఖర్జూరపుఆకులు కప్పుదురు. వీరి ముఖ్యవృత్తులు-వ్యవసాయము, పశువులను పెంచుట. రొట్టెపాలు ఖర్జూరపుకాయలు వీరి ఆహారపదార్థములు తోలువస్తువులు - కంబళ్లు నేయుట, ముఖ్యపరిశ్రమలు ఒంటెపాలు త్రాగుదురు.

(17) ఈజిప్టుదేశమునకుగల యితరపేర్లేమి ? దాని ప్రాచీన ప్రాముఖ్యతకు కారణములెవ్వి ?

జః— ఈజిప్టుదేశమునకు - నైలునది వరప్రసాదిని లేక నైలునది భిక్ష లేక సహారాయొక్క పెద్ద ఒయాసిస్సుయని పేర్లు. పూర్వకాలమునుండియు యీదేశమందు గొప్ప కట్టడములు కలవు. శిల్పశాస్త్రము, జ్యోతిషశాస్త్రములందు ప్రవీణులుకలరు. అక్షరములను, వ్రాతయు, మొదట కనిపెట్టినవారు ఈజిప్టు దేశస్థులే.

(18) నైలునదిని గూర్చి వ్రాయుడు ?

జః—నైలునది విక్టోరియా నయాంజాసరస్సునందు పుట్టినది. దీనికి తూర్పువైపునుండి నీలపునైలు - అటబారాయను రెండు ఉపనదులు అబిసీనియా పీఠభూమియందు పుట్టి దీనిలో కలియుచున్నవి. దీనినిడివి 4000 మైళ్లు ప్రపంచములోని నదులలో పొడవునందు రెండవది. ఈనదికి "ఆస్వాను"వద్ద గొప్ప ఆనకట్టకలదు. ఇది పుట్టినచోటునుండి ఉత్తరముగా ప్రవహించి మధ్యధరాసముద్రములో కలియుచున్నది. నదీ ముఖద్వారమున కైరో పట్టణముకలదు.

(19) ఈజిప్టుదేశమందలి పంటలు—ముఖ్యముగా ఎగుమతియగు సరకులెవ్వి ?

జః—ప్రత్తి, చెఱకు, వరి, మొక్కజొన్నలు. గోధుమలు, యవలు, పండును. ఇచటనుండి ముఖ్యమైన ఎగుమతి ప్రత్తి.

(20) నైలునది సంవత్సరముపొడుగునను పుష్కలముగ నీటిని గల్గియున్నది-కారణములెవ్వి ?

జః—నైలునది విక్టోరియా నయాంజానరస్సులో పుట్టినది. జన్మస్థానము మొదలు 'అస్వానువరకు పెక్కు జలపాతములు' గలవు. ఈనది జన్మస్థానమున సంవత్సరము పొడవునను వర్షములుకురియును. నైలునదికి అబిసీనియా పీఠభూమినుండి వచ్చు ఉపనదులగు బ్లూనైల్ - అటఖారావల్ల వరదలు గల్గుచుండును గాన నీరు పుష్కలముగా నుండును.

(21) నైలునదికిగల జలపాతములెవ్వి ?

జః—రిప్పన్ - మూర్చిసన్ మొదలగు జలపాతములు గలవు.

(22) కైరో - అలెగ్జాండ్రియా పట్టణములనుగూర్చి వ్రాయుఁడు ?

జః—కైరో నైలునది ముఖద్వారమునగల గొప్ప పట్టణము. ఈజిప్టు దేశమునకు ముఖ్యపట్టణము. ఆఫ్రికా దేశములోని గొప్పపట్టణము. ఇది వినసకత్తకు దాని పిడికి మధ్యనున్న రత్నమువలె డెల్టాశిరస్సున గలదు. ఈపట్టణ సమీపమున ప్రసిద్ధి పొందిన పిరమిడ్లను పూర్వకాలపు రాజుల గోరీలుగలవు. కరాచినుండి లండనుపోవు విమానము లిచట నిలుచును.

అలెగ్జాండ్రియా-ఈజిప్టుయొక్క ముఖ్య ఓడరేవు. పట్టణము. అలెగ్జాండరను గ్రీసురాజుపేర పిలువబడెను. మంచి హార్బరుకలదు. దీనికి మధ్యధరాసముద్ర సమీపమునగల దేశములతో వర్తకసంబంధముకలదు. ఈజిప్టులోని ప్రత్తి యిచట నుండియే యితరదేశములకు బోవును.

---

# బా లా న ం ద ము

వేదాంతము శ్రీనివాసాచార్యులు

(ఉండాలోయి - ఉండాలీ.)

(1) పాపకు—పలక
పాలకు—పీకె
పశువుకు—పాక
పాటకు—పల్లవి ॥ఉండా॥

(2) రైతుకు—ఎద్దు
లెక్కకు—పద్దు

మాటకు—హద్దు
నవ్వుకు—ముద్దు ॥ఉండా॥
(3) ఆవుకు—డొక్క
కాకికి—రెక్క
పాపకు—పక్క
తాంబూలానికి—వక్క ॥ఉండా॥
(4) భాషకు—హిందీ
లోకానికి—గాంధీ
నాటకానికి—రంధీ
రాజుకు—నంధీ ॥ఉండాలి॥
(5) పూలకు—బుట్ట
చేనికి—గట్టు
పాముకు—పుట్ట
విద్యార్థికి—జట్టు ॥ఉండాలి॥

---

# ఉపాధ్యాయులు ప్రతి బాలికయొక్క మానసిక పరిస్థితిని పరిశీలించి తమ బోధనాపద్ధతులయందుపయోగించుట

వై. శేషమ్మ అసిస్టెంటు-బోర్డుహాయ్యరుఎలిమెంటరీ గరల్సుస్కూలు - గుడ్లవల్లేరు.

భగవంతుడు జీవరాసుల కన్నిటికంటె మానవున కధికముగా బుద్ధిబలమును ప్రసాదించెనుగదా! ఆబుద్ధి బలమభివృద్ధినొందుటకు తల్లి మొదటిగురువు, తండ్రి రెండవ గురువు, ఉపాధ్యాయుడు మూడవగురువు సాధారణముగా శిశువు తల్లిగర్భమందున్నప్పుడే తల్లి వినుమాటలబట్టియు, నామె చేయు నాలోచనల ననుసరించియు, నామె భుజించు పదార్థముల బట్టియు, శిశువునకు జ్ఞానాజ్ఞానము లుద్భవించును. ప్రహ్లాదుడు, అభిమన్యుడు మున్నగు పురాణపురుషు లిందుకుసాక్షులు.

ఉపాధ్యాయుడు ప్రతిబాలికయొక్క మానసిక పరిస్థితిని పరిశీలించుట మిక్కిలి కష్టమే! అయినను శక్తికొలది శ్రమ జేయుట ముఖ్యవిధి. విత్తనమునకు నీటి సంపర్కము గలుగగనే మొలకలెత్తునటుల శిష్యునిపై గురుబోధామృత వృష్టి గురియగనే శిష్యునిలో దాగియున్న శక్తి బీజములు మొలకలెత్తగలవు. ఉపాధ్యాయుడు ప్రతిబాలికయొక్క మానసిక పరిస్థితిని బరిశోధించుటకుముందు దానుగూడ విద్యార్థులలో నొకవిద్యార్థియై సంచరింపవలసియున్నది. తేనెటీగ పువ్వుపువ్వున కెగిరియుండందున్న మకరందమును బానము జేయు భాతి, గురువు ప్రతివిద్యార్థిలోను

నేస్తముజేసి వారివారి యంతశ్శక్తులను గ్రహించు టత్యంతావసరము. వారితో జ్ఞానబీజములు నాటుటకు మున్నువారి మనోక్షేత్రములను సరిజేయవలయును. ఇందులకువిద్యార్థులయొక్క జననీజనకులను దర్శించి సంభాషించు టావశ్యకము.

ఉపాధ్యాయులు బాలికలకు పాఠశాలలో విద్య నేర్పుసమయమున బెద్దవారితో బాటుచిన్నపిల్లలను మిక్కిలి కట్టుబాట్లలో నుంచరాదు వారి మనఃప్రవృత్తిని గనిపెట్టి కనీసమరగంట కొకసారియైనను పాఠమును మార్చుచుండుట మంచిది. మరియు ప్రతి దినము సాయంకాలము ఆటలాడించుట వలన నానందమయులై యుందురు. సంతోషము సగము బలమన్నకరణి పిల్లలెంత యుత్సాహముగనున్న నంతయారోగ్యవంతులై క్రమముగా బడికివచ్చుచుందురు. నూతనముగా బడికివచ్చిన పిల్లలుపాధ్యాయుల గాంచగనే బెదరుటనైజము. అట్టివారిననేక విధముల లాలనజేసి బడికి రప్పించుట యుపాధ్యాయుల ధర్మము. పిల్లలందరికిని క్రొత్తవసనములు, క్రొత్త యాభరణములన్న నమితానురాగము. నగలుపెట్టుకొనుటలోనున్న ప్రమాదముల నుపాధ్యాయులు స్పష్టీకరింపవలెను. దుస్తులు, దేహము, గేహము, గ్రామమువగైరాల శుభ్రతను విశదపరచవలయును. వంటపని, చేతిపనులు, డ్రామాలు, మొదలైనవి నేర్చి యుపాధ్యాయులు విద్యార్థులలోపాలోపములను సవరింపవలెను. పాలు, నీళ్లుకలిసినవానిని విభజించునేర్పు హంసకే యున్నట్లు విద్యార్థులలో మిశ్రితములై యున్న జ్ఞానాజ్ఞానములను విడదీయు నేర్పు గురువునకుగాక యొరులకసాధ్యము. బంగారమున కగ్గి పుటముబెట్టిన వన్నె హెచ్చిన భంగి విద్యార్థులు గురుజ్ఞానాగ్నిలోబడి శిక్షబొందినగాని వన్నెకెక్కలేరని విన్నవించుచు విరమించుచున్నాను.

---

## ఆగష్టు చెడ్డనెల

డి. యస్. ప్రకాశరావు.

i. ఆగష్టు 1914 లో ప్రచండమైన ప్రపంచ సంగ్రామము ప్రారంభమైనది

ii. ఆగష్టు 1920 లో లోకమాన్య బాలగంగాధర తిలక్‌గారు తమభౌతిక శరీరమును వీడి కీర్తికాయమును ధరించిరి.

iii. ఆగష్టు 1940 లో మనరాజప్రతినిధిగారగు లిన్లిత్గో ప్రభువుగారు భారతీయులు మెచ్చని ప్రకటన నొకదానిని చేసియుండిరి.

iv. ఆగష్టు 1941 లో రవీంద్ర కవీంద్రుడు మనలను విచారసాగరమున ముంచి 'దివిజకవివరు గుండియల్ దిగ్గురనన్' ట్లుల. అమరపురి కేగినాడు.

v. ఆగష్టు 1942 లో మన నాయకులగు మహాత్మగాంధి, జవహరిలాల్ నెహ్రూ, మౌలానా, అబుల్ కలాం, అజద్ మున్నగు నాయకమణు లనేకులు దొరతనమువారిచే నిర్బంధము నందుంచబడిరి.

vi. ఆగష్టు 1942 లోనే మహాత్మాగాంధీగారియొక్క 'బహిఃప్రాణమ'గు మహదేవదేశాయిగారు మనలను దుఃఖసముద్రమునందు వీడి పరలోకగతులైరి.

vii. ఆగష్టు 1942 లోనే మన చక్రవర్తిగారి సోదరులగు కెంటుప్రభువుగారు (Duke of Kent) చనిపోయిరి.

# అంకెల తమాషాలు

డి. యస్. ప్రకాశరావు.

(1) 45 లో 45 తీసివేయుచో మరల 45 రావలయును.

987654321 = 45
123456789 = 45
864197532 = 45

N. B. 1, 2, 3, 4, 5......అన్నియు కలుపుచో 45 వచ్చును.

| | | |
|---|---|---|
| (2) అంకెలు వరుసగా | ... | 1234567890 |
| త్రిప్పి వ్రాయగా | ... | 0987654321 |
| తీసివేయగా | ... | 246913569 |
| వీటిని త్రిప్పివ్రాయగా | ... | 965319642 |
| మొత్తముచేయగా | ... | 1212233211 |
| వీటిని త్రిప్పివేయగా | ... | 1123322121 |
| మొత్తముచేయగా | ... | 2335555332 |
| వీటిని త్రిప్పి వేయుచో | .. | 2335555332 |
| తీసివేయుచో | ... | 0000000000 |

## (3) యుక్తి లెక్క

ఒక చతురాకారముగ నున్న బడిగది మూలలలో మూలకు ఒక్కొక్క కుర్చీ చొప్పున యున్నది. యీ ఒక్కొక్క కుర్చీకి యెదురుగా మూడేసి కుర్చీలున్నవి. ఆగదిలోని మొత్తము కుర్చీలెన్ని ?

## మీరు చెప్పగలరా ?

డి. సత్యనారాయణరావు పట్నాయక్

ప్రపంచమునందలి (1) పెద్దనది, (2) పెద్ద ఆనకట్ట, (3) పెద్ద వంతెన, (4) పెద్ద పర్వత శిఖరము (5) పెద్ద సామ్రాజ్యము, (6) పెద్ద దీవి, (7) పెద్ద యెడారి, (8) పెద్ద సముద్రము, (9) పెద్ద ఖండము, (10) జగద్విఖ్యాతి గాంచిన ఆంధ్రుడు. (ఆధునికాంధ్రుడు)

ఙ వా బు లు :

1. అమెరికాలోని మిసోరిమిసిసిపీనది. 2. కావేరినదియొక్క ఆనకట్ట (మెట్టూర్ డామ్). ౩. అమెరికా సంయుక్తరాష్ట్రముల పశ్చిమతీరమున శాన్‌ఫ్రాన్సిస్కో, ఓక్‌లండు పట్టణముల నడుమ నున్నది. ఈ వంతెనకు రెండతస్తులు కలవు. ఒక అంతస్తున ధూమశకటములును (రైలుబళ్లు) రెండవ అంతస్తున నిర్జంతు నిర్ధూమశకటములును (మోటారుబస్సులు) పోవును. 4. ఎవరెస్టు. 5. ఆంగ్ల సామ్రాజ్యము. 6. ఆస్ట్రేలియా. 7. సహారా ౮. ఫసిఫిక్. 9. ఆసియా. 10. సర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుఁడు.

---

# ఉపాధ్యాయుని మొఱ

(వేదాన్తము - శ్రీనివాసాచార్యులు)

ప్రాథమిక ఉన్నతపాఠశాలలు జూన్ మొదటి లేక రెండవవారములో తెఱువబడెను. పాఠశాలలు పనిచేయవలసిన దినములు 2200 అందు 8 వ తరగతి విద్యార్థులు మార్చి నెలాఖరువరకు మాత్రమే పాఠశాలకు హాజరగుదురు. ఏప్రిల్ మాసమందు గవర్నమెంటు పరీక్షలు జరుగును. షుమారు 8 వ తరగతి విద్యార్థులు బడికి హాజరగు దినములు 190 కి మించనేరవు.

ఈ సంవత్సరము ఆగష్టు 20 వ తేదీ వరకు తెలుఁగు సెలక్షన్సు ప్రచురింపబడి యుండలేదు. ఇప్పటికి పాఠశాలలో 54 బడి దినములు జరిగినవి. ఉపాధ్యాయులు 135 బడి దినములలో శ్రీ గవర్నమెంటువారిచే నిర్ణయింపబడిన పాఠ్యంబును బూర్తి చేయవలసి యుందురు.

మఱియు సాధారణముగా ప్రతి ఉన్నత ప్రాథమిక పాఠశాలలోను ఉపాధ్యాయుఁడు రెండు తరగతులకు విద్యగఱపవలసినవాఁడుగా నుండును. పరీక్షకు హాజరగు బాలబాలికా పిన్నవయస్సు గలవారు. బాధ్యత నెరుంగనివారు. పల్లెటూరులందుండు యీ బాలబాలికల తల్లిదండ్రులకు వారిబిడ్డలను సక్రమముగా పాఠశాలకు బంపవలయుననెడి విషయము సహితము గుర్తులేనివారు. సాధారణముగా వేరుశనగకాయలపంట వరికోతల సమయములందు పై తరగతుల బాలబాలికలు గైరుహాజరగుట హెచ్చు, డిపార్టుమెంటువారు పరీక్షాఫలితములు తక్కువనియు పాఠశాలలందు విద్యాప్రబోధము సరిలేదనియు, ఉపాధ్యాయ బృందముపై ధాడిచేయుట, గ్రాంటులో కోతనుపెట్టుట. బదిలీలకు సిఫార్సుచేయుట మొదలగు పనులు జరుగుచుండును.

రాబోవు వత్సరములో శ్రీ గవర్నమెంటువారు ప్రాథమిక పాఠశాలల తెలుఁగు సెలక్షన్సు జూన్ నెలలోగా ప్రచురించి బాలబాలికలను ఉపాధ్యాయులను కష్టములనుండి తొలగింప ప్రార్థించుచున్నాము.

---

# పల్లెటూరి బడి పంతులు

కొడాలి దామోదరయ్య

ఉ॥ చీకటితోనే లేచు మఱి ♦ చీకటితోనె పరుండు, జీతమున్
నాకును జాలదో యనఁడు ♦ నాగటి మానిసి వోలెఁ గష్టమున్
దేకువఁజేయుచుండు గను ♦ నింపడు పేదతనంబు, వెట్టిగా
చాకిరిఁ జేయుచుండు శిర ♦ సా వహియించును నెవ్వరేమనన్.

ఉ॥ తా నధికారులానతి వి ♦ ధంబునఁబోవునె కాని యెన్నడున్
దాని సుమంతమా రనఁడు ♦ దప్పులు వట్టడు నిస్పృహత్వముం
బూనఁడు మానివోలెఁ దన ♦ పొట్టకుఁ గోరడు; కల్గి నంతలో
దానయవృత్తిలో బ్రతుకు ♦ దారసుతాదిక పోషణంబునన్.

ఉ॥ తాన తమో విదూషకుఁడు ♦ తాన చరాచర వస్తు తత్త్వ వి
జ్ఞాన రహస్య బోధకుఁడు ♦ తా వెలిగించును జ్ఞాన చక్షువై
మానవకోటినెల్ల; నభి ♦ మానముతోఁ దనియింపు డాతనిన్
గానుక లిచ్చి మెచ్చఁదగు ♦ గౌరవ మిచ్చి భజించి నిచ్చలున్.

షరా:—ఈ వ్యాసకర్త వ్రాసి పంపిన పద్యములందు ఛందోదోషములు మిక్కుటముగా నుండుటచే నవి సవరింపఁబడి మఱల వ్రాయబడినది. ఒక పద్యము సవరణకు వీలుగాకుండుటచే వదలివేయఁబడినది. ఇందులకు వ్యాసకర్త మాయెడఁ గినుక వహింపకుండుఁగాక యని మనవి.

—సంపాదకుఁడు.

---

# ప్రాథమికోపాధ్యాయులు - యుద్ధ అలవెన్సులు

జి. కె. చౌదరి.

ఏనాడు హిట్లరు జర్మనీకి సర్వాధికారి అయ్యాడో ఆనాడే ప్రపంచాకాశాన యుద్ధ మేఘాలు ఆవరించాయి-ఐదేండ్ల నుండి యెడతెరపిలేకుండా సాగుతూన్న చీనాజపాన్ యుద్ధమును మినహాయిస్తే ఈ ప్రస్తుత సంగ్రామము నిన్న మొన్నటిదాకా ఆసియాఖండానికిగాని, ఆసియాఖండాంతర్గతమైన ఇండియాకుగాని, అంటీ అంటకుండా వుంది. కాని ఈమధ్యజపాన్ ఆకస్మిక విజృంభణవల్ల దూరప్రాచ్యదేశాలు, ముఖ్యముగా ఇండియాకూడ, యుద్ధరంగానికి నడిబొడ్డుగా వున్నాయి. ఎన్నివిధాల చూచినా గతప్రపంచసంగ్రామానికీ ఈ సంగ్రామానికీ, ఏవిధముగానూపోలిక లేదు. ముప్పది, సంవత్సరాల మానవవికాసము-శాస్త్రీయాభ్యున్నతికూడ, ప్రస్తుత సం

గ్రామతీవ్రతకు దోహదమిస్తున్నాయి.

అభయము-శుభయూ - యెరగనిలక్షలాది మానవకోటి నాశనమవడము-ప్రజల జీవితావసర వస్తూత్పత్తిచేయు యంత్రాగారాలు యుద్ధావసరవస్తూత్పత్తిచేయడము-యుద్ధావసరపు ముడిపదార్థాలుగాక మానవజీవితావసరపు ముడిపదార్థాల ఉత్పత్తులు తగ్గిపోవడము ఎగుమతి దిగుమతి సౌకర్యాలు-లేక ప్రజలు నానాబాధలు పడడము; అందులోను ప్రజావసర వస్తువుల ధరలు విపరీతముగా పెరిగి పోవడముకూలినాలిచేసుకొని జీవించేవారు, స్వల్పవేతనపుచ్చుకునేవారుకూడ, కట్టగుడ్డ, తినతిండీకరవై నానాబాధలు పడటము-తీవ్రరూపముగా క్షామము-ప్రజల తిరుగుబాటు-దోపిడీలు, వగైరా అనేకమార్పులు కూడ వస్తాయి. ఇదినిజంగా ప్రభుత్వానికిసంధి సమయమువంటిది. యుద్ధనిర్వహణములో అప్రమత్తతగా వుండాలి. ప్రజలలో ద్వేషభావము-కాటకము మొదలైనవి కలగకుండాను చూస్తూవుండాలి. మన దేశములో కూడ ఆహారపదార్థాల-ఇతరజీవితావసర వస్తువులధరలు విపరీతముగా పెరిగి పోవడముచేతనే కొన్ని వస్తువులు నిర్ణీతధరలకు మించి అమ్మకూడదనీ, స్వల్పవేతనాలు పుచ్చుకునేవారి జీవితసౌలభ్యం కొరకు యుద్ధ అలవెన్సులనిచ్చియు, ప్రభుత్వము వారు కృతకృత్యులయ్యారు.

కాని ఈ రెండుపనులూ యెంతవరకు సఫలమైనాయో విచారిద్దాము. కంట్రోలు పెట్టిన పప్పుదినుసులు, పంచదార, సామాన్యరకము బట్టలు, ఇతరవస్తువులు కూడ, వ్యాపారులు ఇష్టమొచ్చిన ఖరీదులకే అమ్ముతున్నారు 60 పుల్లల అగ్గిపెట్టె 5 పైసలకు మించి అమ్మకూడదన్నా 40 పుల్లల పెట్టె 6 పైసలకు పూర్తిగా అమ్ముతున్నారు. కిరసనాయిల్ సీసా 6 అణాలకు తక్కువ అమ్మడమేలేదు. ఆహారపదార్థాల ధరలు కూడ వ్యాపారుల ఇష్ట ప్రకారమే అమ్మబడుతున్నాయి. ఈధరవరలన్నీ తరుచు ప్రభుత్వపు అదుపు ఆజ్ఞలకు లోనయ్యే పట్టణాలలోవి. ఉరిమిందంటే మొలిచిందనే పల్లెటూళ్లలో ధరలు ఎల్లావుంటాయో ఆలోచించండి!

ఇక అలవెన్సుల విషయము: గవర్నమెంటు నౌకర్లకు, పోస్టు, P. W D, రైల్వే కార్పొరేషన్, కొన్ని ప్రయివేటు మేనేజిమెంట్ల క్రిందవున్న పారిశ్రామిక ఉద్యోగులకు కూడయిస్తున్నారు. కాని L. F. సర్వీసులోవున్న ప్రాథమికోపాధ్యాయులకు మాత్రము సదరు యుద్ధ అలవెన్సులు యిచ్చినట్లు తెలియదు. ఈక్లిష్ట పరిస్థితుల లో ప్రభుత్వానికి ధనరూపముగాను, ఇతర విధాలకూడ యెన్నోరీతుల సాయపడుతున్న బోర్డు మునిసిపల్ ప్రాథమికోపాధ్యాయులకు కూడ యుద్ధఅలవెన్సుల నిచ్చి వారిజీవితములు సుఖముగా సాగునటుల జిల్లాబోర్డులను, మునిసిపల్ కౌన్సిళ్లను, కోరుతూ, అందుపై తగుచర్యతీసుకోవలసినదిగా ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాను.

---

# స్త్రీకి ఎట్టివిద్య కావలెను.

ఏ. యస్. చలపతిరావు

ఈ విషయమును చర్చించుటకు ముందు విద్యయననేమో యొకింత తెలిసికొనవలసియున్నది. విద్యయనగా జ్ఞానియని యర్థము. విద్యయను పదము ఈ ధాతువు నుండి పుట్టుటచే విద్యను జ్ఞానమార్గమని నిర్వచింపవచ్చును. అందుచే అక్షరజ్ఞానమున్న వానిని విద్యావంతుడని చెప్పరాదు. యుక్తాయుక్త విచక్షణగలవాడే విద్యావంతుడు. నేటి విద్యావిధానములోపభూయిష్టమై యున్నది. ఉదరపోషణయే నేటి విద్యయొక్క ఆశయము అదియే లక్ష్యముగా నుంచుకొని చదువుదమన్నను చదువుకున్న వారందరకును ఉద్యోగములు లభించకున్నవి. కావున ఈ విద్య స్త్రీలకే కాక పురుషులకు కూడ పనికిరాదని చెప్పుచో పరిహాసాస్పదము కాజాలదు.

స్త్రీకి ఎటువంటివిద్య కావలయునను దానిగురించి చర్చించుటకు ముందు స్త్రీ విద్యా ప్రతికూలుర వాదములను ఖండించవలసియున్నది. స్త్రీలకు విద్య నేర్పరాదనియు, నేర్పినచో పాడగుదురనియు, కొందరి యభిమతము. కాని వీరు, పురుషులకు విద్యనిచ్చినచో వారు ప్రేమలేఖలు వ్రాయుదురేమోయని మగవారికి విద్యనిచ్చుటమానిరా? విద్యలేని వారెంతమంది వ్యభిచరించుటలేదు. విద్యనేర్చుట వలన పాడగుదురని చెప్పుట కేవలము అవివేకము. జ్ఞానమునిచ్చునదే విద్యయైయుండ స్త్రీలు విద్యవలననే పాడగుదురనుట పరిహాసాస్పదముగదా? కావున స్త్రీకి విద్య నిచ్చుటచే చెడుగుణములు గలదిగా మారదని ఘంటాపదముగా చెప్పగలను.

స్త్రీలు తాముకూడ ఉద్యోగములు చేయుదుమనియును, పురుషుల పనులలో తామును పాల్గొనెదమనియును, వాదింపరాదు. ఈ సందర్భమునందు గాంధీమహాత్ముని వాక్కులు గమనింపదగియున్నవి. "స్త్రీ తన గృహిణీధర్మమువదలిపెట్టితుపాకి బూనవలయునని కోరుట స్త్రీపురుషుల కిద్దరికి నిందార్హమైనది. ఆలోచించిచూడగా స్త్రీ పురుషులిద్దరు సమానులే......కాని యిద్దరును సమానులైనను కొన్ని ధర్మములో వారికి భేదము లేకపోలేదు. ముఖ్యముగా శిశుపోషణ స్త్రీ ప్రత్యేక ధర్మము. దానిని వీడిపురుషునితో బాటు, గుఱ్ఱపుస్వారి, ఆయుధధారణము, మున్నగున విరుద్ధవృత్తులలో పాల్గొనట యుభయులకు గర్హితాంశములే. స్త్రీ తన ధర్మమును వీడుటచే పతితురాలగును. పురుషుడు స్త్రీ ధర్మమును వీడుమనుటచే పాపియగును" (హరిజన్ వారపత్రిక) రాధాకృష్ణ పండితుడు కూడ యీ మధ్య బొంబాయిలో జరిగిన స్త్రీల సభకు సలహానిచ్చుచు "మీహద్దులను మాత్రము మీరకు" డని చెప్పినాడు. కావున స్త్రీలకు పురుషులకు బోధింపబడు విద్యను గఱపరాదు.

విద్యయన ఆంగ్ల భాషయే యని కొందరు అపోహపడి తమ ఆడుబిడ్డలను ఉన్నత పాఠశాలాంతపు విద్య (ఎస్. ఎస్. యల్. సి. స్కూల్ ఫైనల్) వరకుచదివించుచు

తమకుమాత్రైలు విధ్యావతులైరనివిఖ్యాపీగుచుందురు. అట్లు చదివిన బాలికలు యిటు ఆంధ్రభాషకు, అటు ఆంగ్లభాషకు, చెడి రెంటికి చెడిన రేవడులగుచున్నారు. అటువంటి విద్యావతులని పిలువబడుచున్న వారికి గృహకృత్యములయందు నేర్పు కలుగదు. గృహకృత్యముల యందారితేరి యుండకపోవుటచే వంట, శిశు రక్షణము, మొదలగు వాటియందు విముఖత కలుగుచున్నది. కావున ప్రస్తుతము స్త్రీల కొసగబడుచున్నవిద్య వారికి అవసరముగాని, శ్రేయోదాయకముగాని, కానేరదు.

కావున దొరతనమువారు ప్రతి పల్లెయందును స్త్రీలకు ప్రత్యేక పాఠశాలల నేర్పరుపవలయును. అందు చిత్రలేఖము, సంగీతము, సాహిత్యము, నృత్యము పాకశాస్త్రము, శిశుపోషణము, రాట్నపరిశ్రమ, మున్నగు చేతిపనులును, గృహాలంకరణము మున్నగు గృహిణీ ధర్మముల కనుకూలమైన విద్యలను, ప్రవేశపెట్టి అర్హతగల యుపాధ్యాయునుల నియమించవలయును. పైన చెప్పబడిన చిత్రలేఖనము, గానము మొదలగు వాటివలన మానసికానందము కలుగును. రాట్నపరిశ్రమవలన కలుగు లాభములు సువిదితములై యున్నవి అర్హతగల యుపాధ్యాయునుల శిక్షణనొందిన బాలికలు అణకువ, సహనము, భక్తి శ్రద్ధలుకలిగి తమ భావి జీవితమును సౌఖ్యవంతముగ చేసికొనగలుగుదురు. విద్యావతియైన స్త్రీ రక్షణ క్రిందనున్న గృహము సర్వాలంకార శోభితమై యుండగలదు. ఇటువంటి ఉత్తమ విద్యలందు మాత్రమే స్త్రీలు కృషిచేసిన మన సంఘము సర్వతో ముఖ్యముగా అభివృద్ధి చెందునని విన్నవించుచు ఇంతటితో విరమించు చున్నాను.

---

# నవ్వు పువ్వులు

ఏ. యన్. చలపతిరావు

ఉపా:- (శిష్యునితో) ఒరేరామూ! నేను చెప్పిన ప్రకారం నీవు ఆవుమీద వ్యాసం వ్రాసినావురా?

రాము:- ఆఁ! కొద్దిగా వ్రాసేసరికే ఆవు పారిపోయిందండీ!

* * * *

ఉపా:- (శిష్యునితో) రంగా! విశ్వమానవ కల్యాణమంటే యేమిట్రా?

రంగ:- అంతే ప్రపంచములో మనుష్యులందరికీ పెండ్లి యని యర్థమండీ!

* * * *

## 8-8-42 వ తేదీని కవుతవరము గరల్సు సెంట్రల్ క్లాసుయొక్క కార్యక్రమములోని వ్యాసము

ఉపాధ్యాయులకు, విద్యార్థులకుగల పరస్పర సంబంధము. ఉపాధ్యాయులు విద్యార్థులయొక్క పాఠశాలాజీవితములో నెట్లు పాల్గొందురు? ప్రతిబాలికయొక్క మానసిక పరిస్థితిని పరిశీలించి వారి బోధనాపద్ధతులయం దుపయోగించుటెట్లు?

ఉపాధ్యాయ సోదర సోదరీమణులారా! నాకు చిన్ననాటిగురువైన మ. రా. శ్రీ. కీ॥ శే॥ కొంపల్లి గురునాథము పంతులు గారి శిష్యవాత్సల్యమును స్మరణకు దెచ్చుకొని నాకుగల యనుభవముల గొన్నింటిని ఈనాడు మీయందరిసమక్షమున వెలిబుచ్చుసావకాశమును లభింపజేసిన మ. రా. శ్రీ. బందరు గరల్సు రేంజిసబుఅసిస్టెంటు ఇన్‌స్పెక్ట్రస్ అమ్మగారికి వందనశతంబులర్పించుచున్నాను. ఇందలి తప్పొప్పులను విమర్శించి దోషములను మన్నింపగోరుచున్నదానను.

---

## ఉపాధ్యాయులకు, విద్యార్థులకు గల పరస్పరసంబంధము.

భగవంతునకు భక్తునకు, తల్లికి పిల్లకు, వృక్షమునకు పక్షులకు, పుష్పమునకు,పురుగునకు, రవికి భువికి, చంద్రునికి చకోరపక్షికి, నీటిబొట్టునకు నిప్పుకణమునకు, మబ్బుకు, మయూరమునకు, కాంతమునకు యినుమునకు, స్వాతివానకు ముత్యపుచిప్పలకు, నెట్టి పరస్పర సంబంధములున్నవో యుపాధ్యాయులకును విద్యార్థులకును నట్టి పరస్పర సంబంధము లుండుట సహజము. భగవంతుడు భక్తుని బరీక్షించుటకు గొన్ని కష్టముల గల్గించి భక్తుడు వానిని సహించినపుడమితానందము చేకూర్చును. గురువుకూడ నదేరీతిని దన శిష్యులకు గష్టమనిపించినను వ్యక్తతవచ్చినతటి పరమాహ్లాదము బొందుదురు.

---

## ఉపాధ్యాయులు విద్యార్థులయొక్క పాఠశాలా జీవితములో నెట్లు పాల్గొందురు?

ఈశ్వరుడు ప్రేమమయుడు. బాహ్యసృష్టికి గోచరింపకపోయినను పిపీలికాది బ్రహ్మపర్యంతమును నతనిప్రేమ యంతర్లీనము. గురువునకు శిష్యునియందుగల నవ్యాజప్రేమ నాతనిబుద్ధికిగోచరము. గురువు స్వలాభపరాయణుడైనచో కామక్రోధాది దుష్టశక్తు లావరించిన మనస్సుమాడ్కి శిష్యుడధోగతిపాలగును గురువే యీశ్వరుడు. శిష్యుడే సృష్టి. వారిమధ్యగల యనుబంధము చిరంతనమైనది. ఇందున్న సారాంశ మునుపాధ్యాయు లెరింగి విద్యార్థులకు విద్యాదానము జేయుదురని నాప్రార్థన.

పురాణగాథలు, నీతికథలు, చరిత్రాత్మకకథలు, మధ్యమధ్య వినోదకథలు చెప్పుచు, సృష్టిచిత్రములసయితము జూపవలెను. సత్సహవాసమే సత్కార్యాచరణకు సత్సాధనమనియు, దుష్టసాంగత్యమే కష్టజాలముల కాలవాలమనియు కర్ణార్జునుల నుదాహరణముగా జెప్పి నిరూపించవలెను. విద్యార్థుల శ్రేయస్సునుగోరి యుపాధ్యాయుడు సామ, దాన, భేద, దండోపాయముల నుపయోగించవలసి వచ్చును ముఖ్యముగా శిష్యులలో నైక్యభావమలవడజేసిన నాయైకమత్యమే దయారసమై ప్రవహించును. అది క్రమక్రమముగా నహింసావ్రతమైన యాత్మస్వాతంత్ర్యమౌనగును. ఆయాత్మస్వాతంత్ర్యమే భావి భారత భాగ్యోదయమునకు బట్టుగొమ్మయై భాసిల్లును

---

# 1942 సం॥ జూలై నెల రిపోర్టు

విశాఖపట్నము, బాలికాపాఠశాలల ఉపాధ్యాయుల సమావేశము 11-7-42 తేదీన Sister M. Gonzaga అమ్మగారి యాజమాన్యమున జరిగెను. ఇది ఈసంవత్సరపు ప్రారంభ సమావేశమగుటచే గత వత్సరపు లేఖక, ఖజానా రిపోర్టులు వినిపింపబడెను. అనంతరము గత సంవత్సరము Secretary గాను, ఈ సమావేశమునుజయకరముగ నడిపి G. L. Prakasam గారు ఆకస్మికముగ ది 8-7-42 తేదీన మరణించుటచే, A-G-Israel ఆమె విషయముకొలది మాటలు చెప్పినమీదట, సభికులందరు ఆమె గౌరవార్థము 2 నిమిషముల కాలము నిశ్శబ్దముగా నిలిచియుండి, దుఃఖసాగరమున మునిగియుండిరి. ఆమె భర్త బిడ్డలకు శోకసానుభూతి లేఖ సమావేశము తరుపున పంపవచ్చునని తీర్మానముచేసిరి. పిమ్మట ఈ నూతన సంవత్సరమునకై ఉద్యోగులు ఎన్నుకొనబడిరి. A- G- Israel సెక్రటరీగను, T- Satyabhama గారు అసిస్టెంటు శెక్రటరీగను, B-w-Simon గారు ఖజానాదారునిగను నుండవచ్చునని నిర్ధారణచేయబడెను. రాజభక్తి కీర్తన పాడుటతో నాటి సభ ముగిసెను.

Vizagapatam }
11—7—42 }

A. G Israel
Secretary

---

# 1942 సం॥ ఆగష్టు నెల రిపోర్టు

విశాఖపట్నము బాలికాపాఠశాలల ఉపాధ్యాయుల సమావేశము ది 8-8-42 తేదీన మ. రా. శ్రీ. G. Vandanam B A, L T. గారి యాజమాన్యమున జరుపబడెను. గత సభ చర్యలు వినిపింపబడినమీదట చందా జమచేయబడెను. శ్రీ. శ. G. L Prakasam గారి భర్త బిడ్డలకు గత నెలలో పంపబడిన సానుభూతి లేఖకు ప్రత్యుత్తరముగా పంపిన లేఖ చదువబడెను. అనంతరము శ్రీయుతులగు G. Vandanam గారు "ప్రస్తుత విషమ యుద్ధపరిస్థితులలో ఉపాధ్యాయుల స్థానము" అను అంశముపై 2 గంటలసేపు బహు చక్కని ఉపన్యాసము నిచ్చి సభికుల నానందపర్చిరి. యుద్ధము ప్రారంభమునుండి నేటి పరిస్థితులవరకు చక్కని కథ రూపములో వర్ణించి, ప్రస్తుతములో బ్రిటిషువారికి వారి సహాయక రాష్ట్రములకు కొలది అపజయము కనుపట్టుచుండినను, రానైయున్న, కొన్ని మాసములలోనే వారికి జయము చేకూరగలదని చెప్పుచు, ఈలాటి వారి పూర్వపు యుద్ధములు, వాటి ఫలితములు పేర్కొనుచు, జయము పొందుచుండినంతదనుకనే జర్మనుల పొంగు, ఒక్కమారు పరాజయులైన, వారి కనుపరాజయులే యగుదురనియు, మన బ్రిటిషువారు విరుద్ధస్వభావులు, పరాజయమునందును నిరుత్సాహులు కానివారని సభ్యుల మనముల నాటో లేనిపోని వదంతులు, కలుగు సీసమయములో కత్తితుపాకులతో యుద్ధభూమిని

పోరాడు యుద్ధవీరునికంటె Propagandaతో ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులు బ్రిటిషు వారికి హెచ్చు సహాయులు కాగలరనియు, ఏది ఎట్లున్నను బ్రిటిషువారికే జయమని వక్కాణించిరి. రాజభక్తి కీర్తన పాడుటతో నాటి సభ ముగిసెను

Vizagapatam }
8—8—42 }

A. G. Isreal.
Secretary.

## టీచర్సు అసోసియేషను-అముజూరు (రామచంద్రపురంతాలూకా)

ది 22—8—42 తేదీ మధ్యాహ్నము 1 గంటకు శ్రీ రామచంద్రపురం రేంజీ స్కూళ్ల జూనియరు డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ వేమూరి వెంకటాద్రియ్య పంతులుగారి ఆధిపత్యమున అముజూరు సెంటరుక్లాసు మీటింగు జరిగినది. అందు శ్రీ ఇనస్పెక్టరుగారు సెక్రటరీ, ట్రెజరరుల విధులు, వారివిషయమై సెంటరు మెంబర్ల విధులు, టీచింగునోట్సు వ్రాయుపద్ధతులు, ప్రతివారికి తెలియులాగు స్వచ్ఛముగా, గంభీరముగా నుపన్యసించిరి.

నాలుగవ తరగతికి ఆతరగతి వాచకములోని ఒక పద్యమును మాదిరిపాఠముగా బోధించిరి. సెంటరుకు సదరుస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ వింజమూరి లక్ష్మణ మూర్తిగారిని కార్యదర్శిగాను, తామరపల్లి బోర్డుస్కూలు అసిస్టెంటు శ్రీ సరస్వతుల సుబ్బారావుగారిని ట్రెజరరుగాను, సత్యవాడ బోర్డుఎలిమెంటరీస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ నందూరి మంగరాజుగారిని సెంబరుక్లాసునుండి స్టాండింగు కమిటీ మెంబరుగాను, సభ్యులందరి యామోదముతోడను, ఏకగ్రీవముగా నెన్నుకొనుటయు జరిగినది.

శ్రీ ఇనస్పెక్టరువారి యమూల్యమగు మాదిరిపాఠమును, ఇతరసలహాలనువిని, మేమందఱము అద్భుతానందమును పొందినాము.

సత్యవాడ. }
23—8—1942 }

ఇట్లు,
వేదుల సూర్యనారాయణశాస్త్రి,
బోర్డుస్కూలు టీచరు

---

ది 8-8-42 తేదీని గుడ్లవల్లేరు కేంద్రోపాధ్యాయ సంఘసమావేశము గుడివాడ రేంజ సీనియర్ డిప్యూటీ యిన్‌స్పెక్టరు గారయిన శ్రీయుతులు G వెంకటరమణ పంతులు B A, E, D, గారి యాధిపత్యమున సమావేశమైనది.

సోదరోపాధ్యాయులుగానుండి చిరకాలము ప్రాథమిక విద్యాభివృద్ధికై అఖండ కృషిజేసి దివంగతులయిన చిల్లరిగె వెంకటరమణయ్య పంతులుగారి మరణమునకును, మన ఉపాధ్యాయ సోదరులలో ఒకరైన బొడ్డుడేవిడ్‌గారి అకాలమరణమునకును, మన యీసంఘము వారు చింతిల్లుచు వారి యాత్మలకు శాంతి నొసంగుటకు భగవంతుని ప్రార్థించుచు వారికుటుంబములకు, సానుభూతులను దెలుపుటకు, ఏకగ్రీవముగా తీర్మానించినారు.

గుడ్లవల్లేరు

తాతినేని గోపాలకృష్ణయ్య, కార్యదర్శి.

---

గుడివాడ తాలూకా ఉపాధ్యాయసంఘము, 5-9-42 తేదీన గుడివాడ మ్యునిసిపలు గరల్సుహయ్యరు యెలిమెంటరీ పాఠశాలభవనమున శ్రీకృష్ణాజిల్లా విద్యాశాఖాధికారిగారియొక్కయు, గుడివాడ రేంజిసీనియరుడిప్యూటీయిన్‌స్పెక్టరుగారియొక్కయూజమాన్యమున జరుపబడి, కార్యక్రమము జయప్రదముగ జరుపబడినది.

ఈసందర్భముననే గుడివాడ రేంజి నాన్‌మిషన్ ఎయిడెడ్‌టీచరు మేనేజర్ల సంఘసమావేశము జరుపబడి, లోగడ ప్రసిడెంటు సెక్రటరీలస్థానే బల్లిపర్రు ఎయిడెట్ మేనేజరుగారగు శ్రీ కాజ సూర్యప్రకాశరావుగార్ని సదరు టీచరుకు మేనేజర్ల సంఘమునకు ప్రెసిడెంటుగాను; గుడివాడ, గౌరీశంకరపురం ఎయిడెడ్ స్కూలు మేనేజరుగారగు శ్రీబుర్రా సత్యనారాయణగార్ని, సెక్రటరీగాను ఏకగ్రీవముగ యెన్నుకొనబడిరి.

అటులనే ఎయిడెడ్ స్కూళ్ల టీచర్ల సంఘమున్నూ, బోర్డుస్కూళ్ల సంఘమున్నూ, ప్రత్యేకసంఘ సమావేశములై వారివారి, ప్రెసిడెంటు సెక్రటరీలు నెన్నుకొనిరి.

తాలూకా టీచర్ల సంఘమునకు కూడ అట్లే ప్రత్యేక, ప్రెసిడెంటు సెక్రటరీల నెన్నుకొనిరి.

ఈ సంఘముల సమావేశములన్నియు మొత్తముమీద జయప్రదముగ జరుపబడినవి.

---

# పోషకసంఘ సమావేశము

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా యలమర్రు శ్రీ సీతారామ హిందూ ఎలిమెంటరీ పాఠశాల తల్లిదండ్రుల సమావేశము సదరు గ్రామపంచాయతీబోర్డు ప్రసిడెంటుగారగు మహారాజశ్రీ కాజ మోహనరావుగారి అధ్యక్షతను ది 28-8-1942 తేదీ సాయంత్రము జరిగెను. సదరు గ్రామ జిల్లాబోర్డు డాక్టరుగారగు మల్లాప్రగడ రామలింగేశ్వరరావు, యం. బి. బి. యస్., గారు విద్యావశ్యకతను గురించియు తల్లిదండ్రులకు ఉపాధ్యాయులకు గల సంబంధమును గురించియు, విపులముగా నుపన్యసించిరి. అధ్యక్షులవారి తుదిపలుకులతో సభ ముగింపబడెను.

యలమర్రు,
6—9—1942.

ఇట్లు,
కాపవరపు నాగమల్లికార్జునరావు.
మేనేజరు,
శ్రీ సీతారామ హిందూ ఎలిమెంటరీ స్కూలు.

# మా గ్రామ విద్యార్థుల తల్లిదండ్రుల సంఘము

ది 14-8-42 తేదీ సాయంత్రము 5 గంటలకు శ్రీరామాలయమువద్ద శ్రీయుత దావులూరి వెంకట సుబ్బయ్యచౌదరిగారి అధ్యక్షతను జరుపబడినది. ప్రథమమున పాఠశాల బాలురచే దైవప్రార్థన జరుపబడెను. పిదప బాలురు "సివిలుదావా" నాటకమును ప్రదర్శించి సభ్యుల నానందపరచిరి. నేను స్త్రీ విద్యావశ్యకతనుగూర్చి ఉపన్యసించితిని. అధ్యక్షులు స్త్రీలకు విద్యముఖ్యమనియు దమతమ బాలికల నింతట నుండి క్రమముగా పాఠశాలకు పంపించవలయుననియు, గంభీరోపన్యాసము నిచ్చిరి. సభకు శ్రీ దావులూరి కోటయ్య చౌదరి (ఈ సంఘ ప్రెసిడెంటు) పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, కరణము, మరికొందరు రైతులు హాజరైరి.

కొత్తలూరు, }
14—8—42 }

అన్నాప్రగడ వెంకట సుబ్బారావు,
కార్యదర్శి

---

# భాగవత రచనా నైపుణ్యము

## సంపాదకుఁడు

శ్రీమదాంధ్ర మహాభాగవతమును రచించిబమ్మెరపోతరాజుకృతార్థుఁడయ్యెను. పోతన భాగవతశిఖామణి. సుకవిపుంగవుఁడు. ఆకవీశుని పవిత్రలేఖిని రచించిన పద్యములు సానలుతీరిన జాతిరత్నములు. వానిరచనానైపుణ్య మలేఖ్యము - అనూహ్యము - అసదృశము అయినను సూక్ష్మదృష్టికిఁ గొంతకుం గొంతగోచరము. ఆ మహాకవిపద్యములు తెలుఁగువాణికి నలంకారప్రాయములు. మరచినఁగాని యేతన్మణి ప్రభలు కవితాలోకమును వెలిగింపఁజాలవు. సామాన్యముగ నేపద్యమును బరించినను బాహ్యాంతరార్థములు తోణికిసలాడుచుండును. ఇట్టివి ముఖ్యముగాఁ బ్రహ్లాద చరిత్రము, వామనావతారకథ, గజేంద్ర మోక్షము, రుక్మిణీకల్యాణము, మున్నగు ఘట్టములలో మిక్కుటముగాఁ గలవు. ప్రస్తుతము వామనావతారకథలోని యొక పద్యము నిట నుచ్చునకై వివరించెదను.

"ఆదిఁ శ్రీసతికొప్పుపైఁ దనువుపై
నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ
బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీ
దై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యముఁ సతతమే ?
కాయంబు నాపాయమే ?"

బలిచక్రవర్తి శ్రీమహావిష్ణువునకు దాన మొనర్పనుత్సుకుఁడై యాపురుషోత్తముని హస్తప్రాశస్త్యము నిందభివర్ణించినాఁడు.

బాహ్యార్థము :

ఇందలి బాహ్యార్థము పరించిన మాత్రముననే సువిదితము. లక్ష్మీదేవి కొప్పు మీఁదను, శరీరముమీఁదను, బుజములపై నున్న వసనముమీఁదను, బాదపద్మముల

మీఁదను, చెక్కిళ్ళమీఁదను, బాలిండ్ల పైనను, నూత్నమర్యాదను బొందునట్టి హస్తము క్రిందై నా హస్తము మీఁదై యుండుటకంటె మించిన శుభముగలదా? అంతకంటె నేను పొందఁగలిగిన గౌరవమేమున్నది? ఈరాజ్యము శాశ్వతమా? ఈ దేహము శాశ్వతమా?

ఇది బాహ్యార్థము. మహాభక్తుఁడగు బలిచక్రవర్తి భగవంతుని పవిత్రహస్తమునకుఁ గట్టిపెట్టు ప్రాశస్త్యము ప్రియురాలి శరీరావయవములమీఁద దిరుగుటయేనా? ఇంతమాత్రమున నాహస్తమునకు నూత్నమర్యాదయేమి? ఇందద్వితీయమగుఘనత యేమిగలదు? భగవంతుని దివ్యహస్తమును వర్ణించుటకు బలిచక్రవర్తికిఁగాని పోతనకుఁగాని, యింతకంటె మహోత్కృష్టములైన కార్యములు తోపలేదా? ప్రియురాలైన లక్ష్మీదేవి యవయవములుస్పృశించుటయే ఘనకార్యములయ్యెనా? వేదోద్ధరణ మొనర్చినహస్తము-జగద్రక్షణ మొనర్చిన హస్తము-భక్తలోకమును బరిపాలించిన హస్తము-దుర్జనశిక్షణ మొనర్చిన హస్తము అని యెన్నియోయితరగుణములఁ జేర్చిగాని యేల వర్ణింపరాదు? బలిచక్రవర్తికివి మఱపునకు వచ్చెనా? పోతనకు దుర్వాహ్యాము లయ్యెనా? ఇదియే యిందలి పెద్ద సంశయము. ఈసందియమును దీర్చ ననువగు నుత్తమార్థమిందున్నదేమో పరిశీలింతము.

**అంతరార్థము:—**

ఉన్నది. భగవంతుని పవిత్రగుణకదంబ మంతయు నిమిడియున్నది. వెన్నుని పవిత్రహస్తప్రాశస్త్యమున కీపద్యము నిధి.

ఆదిన్ = మొట్టమొదట ప్రారంభమున-భగవంతుని పవిత్రహస్తము శ్రీసతికొప్పుపై సంచరించినది. ఇట శ్రీసతి యనఁగా కేవలము ప్రియురాలైన లక్ష్మి యని తలంపఁగూడదు. లక్ష్మి యనఁగా లోకమాత - మంగళదేవత - భక్తురాలు ప్రపంచమున కాది ఇట్టి భక్తురాలి శిరస్సుమీఁద భగవంతుఁడు తన పవిత్ర హస్తము నుంచినాఁడు. ఎందులకు? ఆశీర్వదించుటకు లోకమాతయగు మంగళదేవతను ఆశీర్వదించుట యనఁగా లోకము కల్యాణభూయిష్టమై యొప్పుఁ గాక యని దీవించుటయే. కాఁబట్టి విష్ణువు హస్తము మొట్టమొదట జేయుపని లోకము నాశీర్వదించుట - అనగా ఆశీర్వదించునట్టి హస్తము. (It is the blessing hand)

తనువుపై - ఆ తరువాత సంచరించినది. భగవంతుఁ డాశీర్వదించినప్పటికి లోకమాత భయపడినది. ఎందులకు? తనబిడ్డలెల్లరు పాపకార్యములకు లోనై భగవంతునకు దూరులై చెడిపోదురేమో యని తల్లడిల్లినది. అప్పుడామె భయమును బాపుటకై విష్ణువు "నేనున్నానులే భయపడకు. నీ సంతానమైన లోకమును నేను రక్షింపఁగలను" అని శరీరమును తట్టి భయమును బాపి ప్రోత్సహించినాఁడు. కాఁబట్టి భగవంతుని హస్తము ప్రోత్సహించునది. భయమునుబాపి ధైర్యము నిచ్చునది. (It is the encouraging hand)

ఆ పిమ్మట నా పవిత్రహస్తము - అంసోత్తరీయంబుపై సంచరించినది. భగవంతుఁడు ప్రోత్సహించినను లోకమాతకు

దిగులు వాయలేదు. తనబిడ్డల తప్పులు తెలియఁబడకుండునా ? అజ్ఞాన కృతములని వానిని జీర్ణింపఁజేసికొనువారెవ్వరు ? తనబిడ్డలకు రక్షణ యెక్కడ ? అని చింతిల్లినది. అప్పుడు భగవంతుఁడామెను జూచి "భక్తురాలా ! చింతిల్లకుము. నేనున్నానుగా! ఈ యుత్తరీయ మేలాగున నీ శరీరమును గప్పి నీ మర్మభాగములఁ గాపాడుచున్నదో యట్లే నేనును నీబిడ్డల తప్పులను గప్పివైచి నాలో జీర్ణింపఁజేసికొని వారిని గాపాడెదను" అని ఆమె యుత్తరీయమును స్పృశించి పలికినాఁడు. కావున విష్ణువు హస్తము లోకము తప్పులను మన్నించి కాపాడునట్టిది. అది రక్షణ హస్తము. (It is the protecting hand)

అటుపిమ్మట - పాదాబ్జంబులపై సంచరించినది. లోకమాతకు భగవంతుఁ డిన్ని తెఱంగుల ధైర్యము గొల్పినను ఆమెకుఁ దన సంతానమైన మానవలోకమును గూర్చి చింత వాయలేదు. "అయ్యో ! ఎన్ని చెప్పిన నేమి ? నాబిడ్డలకు వలయు వానిని సమకూర్చువా రెవ్వరు ? వారికి సాయముచేయువారెవ్వరు?" అని యామె దురపిల్లినది. అప్పుడు భగవంతుఁడు "దిగులుపడకుము. నేను దాసాను దాసుడను. నీ బిడ్డలు నన్ను నమ్మరు రేని వారికి నేను దానుడనై యన్ని పనులు చేసెదను. వారి కేకొఱంతయును కలుగ నీయను." అని చెప్పినాఁడు. అందువల్ల నే యా పవిత్ర హస్తము పాదాబ్జంబులపై సంచరించినది. కాబట్టి విష్ణువు హస్తము భక్తులకు సేవలుచేయునది అనఁగా లోకమునకు సేవచేయునది. (It is the serving hand.)

అటుతరువాత కపోలతటిపై సంచరించినది ఇంతచెప్పినను జగజ్జననికి చింత వాయలేదు. "తన సంతానము భగవంతుని మఱచినచో నేమిదిక్కు ? వారు భగవద్దాసులు గాకున్న రక్షించువారెవ్వరు ?" అని వెక్కివెక్కి యేడువ సాగినది. అప్పుడు భగవంతుఁడు "ఏడువకు. నేను నీసంతానమును నన్ను భజించునట్లు చేసెదను. ఒకవేళ వారు నాకు దూరమైనను వారిని నేను విడువను. వారి వెనువెంటనే యుండెదను. ఎంత చెడ్డవానినైనను నేను కరుణింతును. నన్నొకసారి ప్రమాదముననైనఁ దలంచెనేని నా చెంతకుఁ జేర్చుకొందును." అని యామె చెక్కిలి పట్టుకొని యూదార్చినాఁడు. కావున నాహస్తము ఓదార్చునట్టిహస్తము(It is the soothing hand.)

అటుపిమ్మట, పాలిండ్లపై, సంచరించినది, ఇంతగా నోదార్చినను లోకమాతకు చింత సన్నగిల్లలేదు. "తనబిడ్డలకుఁ గూడు పెట్టువారెవ్వరు? ఆహారాదికములు వారెట్లు సంపాదించుకో గలరు ? వారి జీవయాత్ర సాగుటెట్లు ?" అని మదిని విచారపడినది. అప్పుడు భగవంతుఁడు "విచారపడకుము. అన్నిటికిని నేనున్నాను. నీ స్తన్యముమాదిరి యెట్టి కష్టములులేకుండ నీ బిడ్డలకు వలసిన యాహారపదార్థములన్నింటిని నేను సమకూర్చెదను. రాతిలోని కప్పకాహారము లభించుటలేదా ? అదియేమి కష్టపడుచున్నది ? నారుపోసినవాఁడు నీరు పోయఁడా ? విచారింపకుము. నీ స్తన్యము క్షీరసమృద్ధి కలిగి నీబిడ్డల మనుచుఁగాక! లోకము వారికిది యాదర్శమగుఁగాక ! నేను నీవలె నొప్పి నీసంతాన

మును బోధించెదను." అని యామె వక్షో జములను మాతృత్వము పెంపొందునట్లు అక్షయమగునట్లు స్పృశించినాఁడు. కాబట్టి యాపవిత్రహస్తము మాతృస్తన్యమువలె లోకమును మనుచునట్టిది. (It is the feeding hand)

ఇన్ని విధములైన యుత్కృష్ట గుణములతో శ్రీమహావిష్ణువు పవిత్రహస్తము ఎప్పటికప్పుడు నూత్నమర్యాదను జెందుచున్నది. ఇట్టి దివ్యహస్తము క్రిందైనా కరము మీఁదై యుండుటకంటె మించిన భాగ్యమేమి గలదని బలిచక్రవర్తి భావము.

♦ ♦ ♦

ఇది నాకుఁ దోఁచిన యంతరార్థము. ఇది యెంతవరకు సమంజసమో చదువరులే నిర్ణయింతురుగాక!

---

R. S

1941 సం॥ భూగోళశాస్త్ర ప్రణాళిక ననుసరించి
రెండవ తరగతి విద్యార్థులకు బోధించుటకు కావలసిన

# బొమ్మల పటములు

1 ఇతరదేశము లందలి బిడ్డలు Children in other lands ఎస్కిమోబిడ్డలు
2. ,, ,, సహారాయందలి బిడ్డలు
3. ,, ,, ఎఱ్ఱయిండియనులు
4 ,, ,, నీగ్రోబిడ్డలు

పైని చెప్పబడిన బిడ్డలనుగూర్చి విద్యార్థులకు బోధించుటకు కావలసిన 48 బొమ్మలు అతి దళసరి ఆర్టుపేపరుపై కాగితమునకు నాలుగు చొప్పున ముద్దులొలుకు నట్లు రంగులలో ముద్రింపబడినవి ఆ యా జాతుల బాలబాలికలు అనుదినము చేసెడి పనులు, నివసించెడి గృహములు, ధరించెడి దుస్తులు, వాడెడిపనిముట్లు, ఆడెడిఆటలు ము॥ గు॥ అనేక విషయములు ఈ బొమ్మలలో జూపడమైనది

సిలబసులో విధించబడిన ప్రకారము ఉపాధ్యాయుడు కథలను బోధించు నపుడు ఈబొమ్మలను విద్యార్థులకు చూపినచో వారి కాయా బాలబాలికలు కండ్లకు కట్టినట్లగుపడుదురు పిల్లలకు సంబంధించిన చేతిపని నేర్పుటకు, బొమ్మలు చేయుటకు ఇసుకతో బల్లపై దృశ్యములు జూపుటకును, మాదిరి చిత్తరువులు వ్రాయుటకును, పిల్లలచే నాటకములాడించుటకును ఈ బొమ్మలు ఉపాధ్యాయునికి తోడ్పడు విధము ఇంతంతయని చెప్పనలవికాదు ఒక్కొక్క పటమునందు బోధింపవలసిన విషయములు ఉపాధ్యాయుని కొఱకు ప్రత్యేకముగ ముద్రింపబడినవి పటములు కొను వారికివి ఉచితముగ ఈయబడును.

48 బొమ్మలుగల 12 కాగితములు (In an envelope) వెల రూ 2-4-0
గుడ్డ, టేకుకఱ్ఱలపై అమర్చబడినవి 3-4-0

వలయువారు.—**ఆంధ్రాబుక్ డిపో** మ్యునిసిపల్ హైస్కూలు రోడ్

**విజయనగరం.**

For E. S. L. C.—Historical Atlas in Telugu with notes Rs. 1—0—0
Map of India in Telugu 0—3—0
Map of the Western Hemisphere 0—3—0

సోల్ ఏజంట్లు:— **రామా అండ్ కో.,**
హెడ్డాఫీసు —ఏలూరు; బ్రాంచీలు —రాజమండ్రి — గుంటూరు.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K వెంకట్రావు B.A, L.T., గారిచే

2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 తరగతులకు

వలయువారు:—రామా అండ్ కో.,

ఏలూరు - మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.